


### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును: రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.




# ఇన్‌స్పెక్టర్ (తెలుగు)

డైరెక్టర్: ఆర్. యెస్. మణి. స్టూడియో: నెప్ట్యూన్

చ ప్రి యా రి లీ జు

# రీటా హెయిర్ టానిక్



రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటికురులను పెంచే అద్భుతమైన హెయిర్ టానిక్. తల వెంట్రుకలు రాలుట, చుండు, బట్టతల మొదలైన కురుల వ్యాధులకు రీటా అమోఘమైనది. మీరుకూడ నేటి నుండియే రీటా వాడుడు. ప్రతిచోటా దొరుకును.




**RITA**
**HAIR TONIC**

---

# బహిష్టు

"దేవీ మాత్రలు" (Registered by the Central Drugs Laboratory Govt. of India under No. CDL/688) ఏ కారణమువల్లనైనను, ఎన్ని నెలలుగా నైనను ఆగిన బహిష్టును అతిశీఘ్రముగాను గ్యారంటీగాను అతిసులభముగాను వెంటనే జారీచేయును. వేనకువేలు ప్రశంసాపత్రములు పొందిన గ్యారంటీగల దివ్య ఔషధము. నకలి మందులను వాడి మోసపోకుడు. ధర (Ordinary) రు. 8-8-0. (Special) కొన్ని నెలలుగా ఆగినవాటికి రు. 10-8-0. వి. పి. పి. ప్రత్యేకము.

# గర్భనిరోధం

"స్పెక్ పిల్సు" (Regd No. 266) సంతానము కోరని వారు 12 రోజులు సేవించిన శాశ్వతముగా 8 సం॥ లకు గర్భము కలుగదు. బహిష్టు మామూలుగా ఔతూవుంటారు. వేనకువేలు ప్రశంసాపత్రములు పొందిన గ్యారంటీగల ఔషధము. ధర రు. 12-0-0. వి. పి. పి. ప్రత్యేకము.

**SEENU & COMPANY**

POST BOX NO. 1638 ( ) MADRAS-1
బ్రాంచి : సింగపూరు.

GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు :
డాక్టరు కే. యస్. కేసరి

సంపుటము ౨౨]     మే 1953     [సంచిక ౫

# విషయసూచిక










జయజయ గృహలక్ష్మీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



## గృహిణిధర్మంలో స్త్రీలకు ప్రత్యేక శిక్షణ



అఖిలభారత మహిళాసంఘ రజతోత్సవానికి అధ్యక్షత వహిస్తూ శ్రీమతి రేణుకా రేగారు 'గృహిణి ధర్మంలో ప్రత్యేక శిక్షణ స్త్రీలకు అవసరమంటూ' ఉద్బోధించారు.

ప్రత్యేక పరిస్థితులలోతప్ప హిందూ సంఘంలో కుటుంబ జీవితం తప్పనిసరైనది. ఆదర్శప్రాయమైన కుటుంబ జీవితాన్ని రూపొందించుకొనే సందర్భములో గృహిణి నిర్వహించేపాత్ర అత్యంత ప్రధానమయినది. అంటే కుటుంబ జీవితానికి గృహిణి జీవకర్ర వంటిది. కాబట్టి ఉత్తమ గృహిణిగా తయారుకావడానికి ప్రతి స్త్రీకి శిక్షణ అవసరము.

ప్రతియొక్క కుటుంబము సుఖంగా చీకు, చింతలేకుండా జీవయాత్ర గడుపాలంటే గృహిణికి యుండవలసిన హక్కులు, అవకాశాలు, బాధ్యతలు గుర్తించబడాలి. వానిని పురస్కరించుకొనిగాని కుటుంబ శ్రేయస్సు, తద్వారా దేశశ్రేయస్సు సమకూరదు.

గురుతరమైన బాధ్యతలను నిర్వహించవలసిన గృహిణికి శిక్షణ అవసరమనునది నిర్వివాదాంశము. ఆ శిక్షణలోని అంశాలు — కుటుంబముయొక్క ఆర్థిక పరిస్థితుల నవగాహనంచేసికొని, తదనుగుణ్యంగా కుటుంబ పరిస్థితులను చక్కబెట్టుకోవడం, భార్యా భర్తలు ఒకరినొకరు అర్థము చేసికొని హక్కులను, అవకాశములను, బాధ్యతలను సమిష్టిగా పంచుకొని వ్యవహరించడం, తమకున్నంతలో అతిథి అభ్యాగతులను దయానుగ్రహములతో ఆదరించడం మొదలగునవి.

హక్కులను గురించి మాత్రము గట్టిగా మాట్లాడుతూ బాధ్యతలను తొలగేసుకొని తిరుగాలనే గృహిణి మూలంగాగాని, కుటుంబ ఆదాయాన్ని గుర్తించకుండా దుబారాగా ఖర్చుపెట్టే గృహిణి మూలంగాగాని, లేదా వచ్చే ఆదాయాన్ని కుటుంబ అవసరాల కనుగుణ్యంగా సక్రమమార్గాలలో ఖర్చుపెట్టలేని గృహిణి మూలంగాగాని కుటుంబ పురోభివృద్ధి సాధించబడలేక పోవడమేకాక తీరని నష్టానికి కారణమగుతుంది.

కుటుంబంలోని దైనికావసరములను పరిశీలిస్తే — సుచియైన ఆహారం, పరిశుభ్రమైన ఉడుపులు ప్రధానమైనవి. వీనిని సమకూర్చే సందర్భమున గృహిణి వహించే బాధ్యత, శ్రద్ధాసక్తులమీదనే కుటుంబముయొక్క ఆరోగ్య సౌభాగ్యాలు ప్రధానంగా నాధారపడి యుంటవి. అంటే ప్రతిదినము పంచభక్ష్య పరమాన్నములు, విలువైన వస్త్రాలు గణ్యతకు వస్తాయనుకోడం పొరబాటు. ఉన్నంతలో ఆరోగ్యకరమైన వాతావరణమును సమకూర్చుకోకలిగిన కూడు, గుడ్డ పురోభివృద్ధి మార్గాన నడిపిస్తవి. అప్పుచేసి పప్పుకూడుతింటే ఏర్పడే పరిస్థితులను గ్రహించి కుటుంబ వ్యవహారములను దిద్దవలసింది గృహిణి.

అయితే ఆదర్శప్రాయమైన కుటుంబ జీవితాన్ని రూపొందించుకోడానికి ప్రస్తుతపు ఆర్థికదుస్థితి తొలగాలి. ఏమూలచూచినా నిరుద్యోగము, ఆకలిమంటలు, ప్రధానావసరముల కొరత తాండవిస్తున్నవి. ఈ దుస్థితినుండి విముక్తిచెందడానికి స్త్రీలు, పురుషులు కూడ బాధ్యతాయుతంగా ఆలోచించాలి.

సగటున చూస్తే కుటుంబ ఆదాయం అత్యల్పం. జనాభాదృష్ట్యా ప్రధానావసరాలామెండు. అంటే కష్టపడి సంపాదించేది కుటుంబంలో ఒకడైతే కూర్చొని తినేవారు

పడిమంది. దానిమూలంగా దైనికావసరాలైన కూడుగుడ్డకే కరువు ఏర్పడ్డప్పుడు ఆయా కుటుంబాలలో ఆరోగ్యలోపం, విద్యలేమి, మొదలగునవి ఏర్పడుటలో విశేషములేదు. కాబట్టి కుటుంబ ఆదాయం పెరిగితే గాని పరిస్థితులు చక్కబడవు. దానికుపకరించగల విద్యాసంస్కరణలు అమలులోకి రావాలి. అలా సంస్కరించబడిన విద్యావిధానంలో కుటుంబం, తదనుగుణ్యంగా దేశంలోని బాధ్యతలను, తమతమ అనుకూలతలను పురస్కరించుకొని స్త్రీపురుషులు వహించేందుకనువుగా నుండాలి. ఆనాడుకాని కుటుంబ జీవితం స్వర్గతుల్యంకానేరదు.

అయితే స్త్రీలు, పురుషులు చేస్తున్న ఉద్యోగాలన్నిటిని చేయకలుగుతారా? చేయగలమని ప్రాకులాడటం సబబా? అనేవి పరిశీలించవలసిన విషయాలు.

పురుషులుచేసే ప్రతి వృత్తికి, ఉద్యోగానికి స్త్రీపోటీ చెయ్యవలసిన అవసరం లేదు. పురుషులు చేయలేనివి, స్త్రీలే పురుషులకంటె మెరుగుగా చేయకలిగే వృత్తులు, ఉద్యోగాలు అనేకమున్నవి. అవి పురుషులు చేస్తున్న వృత్తులు, ఉద్యోగాలకు ఏ మాత్రము తీసిపోవు. కాబట్టి తాముచేస్తున్నవృత్తులుగాని, ఉద్యోగాలుకాని ఎదటివారు చేస్తున్నదానికంటె మెరుగని విర్రవీగడానికి స్త్రీలకు గాని, పురుషులకుగాని అవకాశముండకూడదు. స్త్రీ పురుషులిద్దరు ఒద్దికగా కుటుంబాన్ని నడుపుకొంటూ బాధ్యతలను, హక్కులను, అవకాశములను వినియోగపరచుకొనకలిగే శిక్షణయే గృహిణి ధర్మంలో స్త్రీల కివ్వవలసినశిక్షణ. ఈ శిక్షణ ప్రస్తుత విద్యా విధానంలో మార్పులు వస్తేనేగాని ఫలప్రదంగా సమకూరదు.

మహిళాపురోభివృద్ధికి ఉపకరించు ఏశాసనాలైనా, శిక్షణలైనా శాసన రీత్యా మాత్రము సత్ఫలితాలు మకూరుస్తవనుకోడం పొరబాటు. వరశుల్కం, వ్యభిచారం లాంటి దురాచారాల నిజస్వరూపాన్ని ప్రజలలో ప్రచారంచేసి వానిని అరికట్టడానికి విశేషమైన కృషి సయితం జరుగాలి.



# ఆంధ్ర జానపద గేయ వాఙ్మయ చరిత్ర

## జంగం కథ

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావు

2

<u>ఉత్పత్తి</u>

ఏభాషలోనైనా తొలిసాహిత్యరూపం పాట. సంస్కృతంలో మనకి దొరికినంతమట్టుకు వేదాలు మొదటిపాటలు లేక గేయాలు. కాని ఈ వేదాలలోని ఋక్కులవంటి విజ్ఞాన కావ్యాలు ఏర్పడడానికి ముందు ఎన్నెన్ని గేయాలు పుట్టి నశించేయో చెప్పలేము. వాల్మీకికిముందే వేదసాహిత్యం పుట్టింది. అటువంటి సందర్భంలో వాల్మీకి మొదటికవి అనడానికి ఎట్లా వీలవుతుంది? ఆయన మొదటి ఐతిహాసిక కావ్యాన్ని రాసిన మహానుభావుడు మాత్రమే కావచ్చు.

సంస్కృతంలో వేదాలు లభించినట్లుగా తెలుగులో తొలిగేయాలు అనబడేవి నేటివరకు లభించలేదు. ఉన్నవాటిలో ఇవి తొలివి అని నిర్ణయం కాబడలేదు. కాని క్రీస్తు శకానికి పూర్వమే తెలుగులో ఎన్నో గేయాలు ఉండేవి అని చెప్పవచ్చు. అది జాతికి సహజం. మనపూర్వ గేయాల లక్షణం ఏమాదిరిగా ఉండవచ్చో, తమిళ వాఙ్మయాన్ని పరిశోధించి కోరాడరామకృష్ణయ్యగారు భాషా సారస్వతములు - 'దేశి' అనే తమ గ్రంథంలో చర్చించేరు.

జంగం కథలవంటివి పూర్వ సంస్కృత సాహిత్యంలో ఉండి ఉండాలి. పాళిసాహిత్యంలో ఉన్నాయి. వచనం గేయంకలిసిన రచనలకి ఆఖ్యానాలని పేరు. సాధారణంగా జరిగిన ఒక ఘటననాశ్రయించుకొని ఇట్టి రచనలుంటాయి. జంగంకథ ఆఖ్యానతరగతికి చెందిన కావ్యం.

దక్షిణ దేశానికి రావడానికి పూర్వం ఆంధ్రులు ఉత్తర హిందూదేశంలో నివసించేవారు. వీరు ఆర్యులలో ఒక శాఖవారు కాబట్టి వీరు ఆర్యాంధ్రులని చెప్పబడుతున్నారు. ఈ ఆర్యాంధ్రులు క్రమంగా దక్షిణదేశం వచ్చేరు. వీరు ఉత్తర దేశంలో ఉన్నప్పుడుకూడ కొంత సాహిత్యం ఏర్పడింది. మొత్తంమీద జంగం కథలలో మూడు మాదిరులు కనబడుతున్నాయి.

### మొదటి మాదిరి

ఆంధ్రులు ఉత్తర హిందూదేశంలో కాంభోజ దేశంలో ఉండేవారు. అప్పటికథే కాంభోజరాజు కథ. దీని రచనాకాలం క్రీస్తు పూర్వం 1000-కి ఇంకా పూర్వం కావచ్చు. కాలవిషయమై కించిద్భేదమున్నా ఒక సంగతి మాత్రం నిజం. ఆంధ్రులింకా కాంభోజదేశంలో ఉండగానే ఈ కథ జరిగింది. ఈ కథే మనకి దొరికిన తొలిసాహిత్యరూపం. (దీని తాలూకు యుక్తి వాదాలు విపులంగా కాంభోజ రాజు కథకింద చర్చించబడ్డాయి.)

కాంభోజరాజుకథలో పాట, వచనం రెండూ ఉన్నాయి. రెండూ కథలోని భాగాలే. కాబట్టి ఇదొక చంపువు. దీనికి ఆఖ్యానమనే పేరు. ఈ కథే తర్వాత ఒక శాఖకంతకీ నమోనా అయింది. చిన్నమ్మకథ, బంగారు తిమ్మరాజుకథ, బాలనాగమ్మ, సన్యాసమ్మకథ మొదలైనవి చంపువులే! అంటే ఆఖ్యానాలే! వీటన్నిటిలో కథ కొంత గేయంలోను, కొంత వచనంలోను ఉంటుంది. ఏ ఒక్కటి తీసివేసినా కథ అసంపూర్ణంగా ఉంటుంది. కథ చంపువుగా రచించబడడానికి రెండు కారణాలు కనబడుతున్నాయి.

ఒకటి, ప్రతి ఘట్టమూ పాటకి తగిఉండదు. అసలు పాట అంటే కొంత ఉద్రేకంమీద తయారయిన వాఙ్మయరూపం. అన్ని ఘట్టాలలోను

ఒకే ఆ ఉద్రేకముండదు. అటువంటి ఘట్టాలు వచనంలో ఉండవచ్చు. రెండో కారణం, కథంతా మొదటినుంచి చివరదాకా పాటలాగుంటే శ్రోతలకు విసుగుగా ఉంటుంది. మధ్య మధ్య వచనముంటే కాస్తమార్పు ఉంటుంది. తెలుగు వాఙ్మయంలో భారతాది చంపూకావ్యాలకి, ద్విపదాది రచనలకి ముఖ్యమైన ఒక భేదమిదే! మూడు, చంపువులేక ఆఖ్యానం భారతీయ వాఙ్మయంయొక్క ఆదిమ లక్షణం. దీనిని గురించి తర్వాత తెలియజేస్తాను.

తెలుగు జంగం కథలలోని వచనాన్ని గురించి ఒకమాట చెప్పవలసుంది. వీటిని ప్రకటించిన ప్రకాశకులలో కొందరు స్వతంత్రించి వీటిలో కొత్త వచనాలు చేర్చినట్టు కనబడుతూంది. బొమ్మల బాలనాగమ్మ కథను అచ్చువేసినవారు * 116-వ పుటలో "చదువరులకు ఇంపుగా నుండుటకుగాను సకల జనరంజిత శిఖామణియగు ఎస్. టి. రాజయ్య గారిచే తప్పులు వీలైనంతవరకు సవరించి, వచనమును సంపూర్తిగా వ్రాయించితిమి" అని ప్రకటించేరు. ఈ కంపెనీవారే పెద్ద బొబ్బిలిరాజుకథలోకూడ 'వచనము వ్రాయబడినది' (1948 లోని ప్రతి) అని తెలియజేసేరు.

మిగత ముద్రణలతో తైఫార్సు చేస్తేనే కాని సంగతులు పూర్తిగా తెలియవు. ఏదైనా ప్రకాశకులు అట్టి స్వతంత్రం తీసుకోడం పెద్దలోపం.

భారతీయ వాఙ్మయంలో చంపూరచనలు ఎంత ప్రాచీనమో ఇక్కడ తెలియజేస్తాను. చంపువులనగా కొంత గేయం కొంత వచనంకలిగిఉన్న రచన (Ballad). "పూర్వ గేయాలు చంపువుగా ఉండడం ప్రాచీన హైందవ వాఙ్మయంయొక్క ప్రత్యేక లక్షణం. ఇవి క్రీస్తుశకం పూర్వమే ఉండేవి. రామాయణ, భారతకథలు .ఇప్పుడు పూర్తిగా శ్లోక రూప గ్రంథాలుగా లభిస్తున్నాయి. కాని ఈ కథల మొదటి రచన అదికాదు, ఈ శ్లోక గ్రంథాలు క్రీస్తు పూర్వం అయిదో శతాబ్దం తర్వాతవి మాత్రమే! అంతకి పూర్వం ఇవి చంపూరచనలగా మాత్రమే ఉండి ఉండాలన్న సంగతి పూర్వరచనల సంప్రదాయ మెరిగిన వారందరికి తెలుసు. బౌద్ధ వాఙ్మయంలో కొన్ని రచనల చంపూతత్త్వాన్నిబట్టి అది నిర్ణయించవచ్చు. (Buddhist India, by Rhys Davids, 117-119 పుటల సారాంశంపైన తెలుపబడింది) ఈ చంపూరచనలకు ఆఖ్యానాలని పేరు. చంపూరచన భారతదేశంయొక్క అతి ప్రాచీన వాఙ్మయంయొక్క విశిష్టరూపం అని చెప్పవచ్చు. ఆంధ్రభాషలోని కాంభోజరాజుకథ ఆ సంప్రదాయానికేకాకుండ ఆకాలానికికూడ చెందినది.

రెండో మాదిరి

చంపువు కథలలోనె ఇంకొకమాదిరివి ఉన్నాయి. వీటిలో వచనంలో కథ కొనసాగదు. పూర్వం పాటలో చెప్పిన కథ సారాంశమే వచనంలో చెప్పబడుతుంది. దీనివల్ల రెండు ప్రయోజనాలున్నాయి. ఒకటి, వెనకచెప్పిన పాటని సరిగా బోధపరుచుకోనని వాళ్ళకి వచనంలో స్పష్టంగా తెలుపబడుతుంది. దానిని విని ముందు కథ వినడానికి సిద్ధపడతారు. రెండు, ఇట్టిమార్పువల్ల పాట విసుగుగా ఉండదు. పెద్దబొబ్బిలిరాజుపాట ఈ మాదిరి రచన.

చంపూరచన ఆంధ్ర కవిత్వానికి బహుసహజమైనది. ఆంధ్రమహాభారతాది కావ్యాలు చంపువులు. ఇవి సంస్కృత కావ్యాలలోని చంపూ పద్ధతిని అనుసరించేయని తలచనక్కరలేదు. క్రీ. పూ. రచనయైన కాంభోజరాజుకథ చంపూరచనే! కాబట్టి ఆంధ్ర మహాభారతంలో ఆంధ్ర దేశీయ విధానమే అవలంబించబడిందని తలపవచ్చు.

మూడో మాదిరి

ఈ మాదిరికి చెందినవి మొదటినుంచి చివరిదాక గేయాలే. అంటే వీటిలో వచనం ఉండదన్నమాట. ఇవి నిర్వచన గేయాలు. ప్రబంధ కవిత్వంలో నిర్వచన కావ్యాలున్నాయి. వీటికి మూలాలువై గేయాలు కావచ్చు.

---

* సి. వి. కృష్ణా బుక్ డిపో, మదరాసు 19

ఆదికాలమందు జంగాలు పాడుతూండడంబట్టే ఈ కథలకి జంగం కథలనే పేరు వచ్చింది.

### ర చ న కా లం

జంగం కథలలో ఒక అపూర్వ లక్షణముంది. ఈ రకం గేయాలకి మిగతవాటికి ముఖ్యమైన తేడా అదే! ఈ గేయాలు ఆ కథలలోని ఘటనలు జరిగిన కాలమందే కూర్చబడ్డాయి. అవి చారిత్రకమైనా అంతే, సాంఘికమైనా అంతే. అవి స్వకపోల కల్పితాలు కావు. ఈ సూత్రానికి కొంత మినహాయింపుగు బాలనాగమ్మకథ కనబడులాగుంది. జంగం కథలకి కొన్ని కవిసమయాలు లేక సంప్రదాయాలున్నాయి. వాటిని గురించి తర్వాత తెలుసుకొందాం. వాటిని తెలుసుకొంటేకాని కథ చక్కగా బోధపడదు.

### ఊ త ప దా లు

ప్రతి కథకి సాధారణంగా ఏదో ఒక ఊతపద ముంటుంది. కాంభోజరాజు కథలో ప్రతి చరణం చివర 'తందానా తందానే' అంటూండాలి. బంగారు తిమ్మరాజుకథలో రామారామా రఘూరామా రామా రఘురామ అన్ని, బాలనాగమ్మ కథలో, తందానే తందానే లేక తందాన రాజనందన, తందాన లేక తందానాబాయి రాజనందన, అనిగాని పాడాలి.

మరికొన్ని పాటలలో మరొక రీతిగా ఉంది. ప్రతిచరణం చివర ఏదో ఒక నామవాచకం కాని, విశేష్యంకాని సాధారణంగా వస్తూంటుంది. ఇదీ ఒకరకం ఊతపదమే!

కామమ్మ కథలో

ఆరునెలల జీతమడిగి పుచ్చుకొని
మారయ్యా
ముగ్గురు దేవతలు వనగూడినారు ఆవేళ
కాకినాడ కొలువు చాలించుకొంటి
చల్లమ్మ

సన్యాసమ్మకథలో

నేను మొఖాసా గ్రామాలు వెళ్లివస్తాను
పాపమ్మ
స్నానంబు తప్ప, ఏపూట తప్పదునో
నా రాజ

మూడో రీతి ఏమిటంటే చరణం చివర పైనచెప్పబడినట్లు నామ వాచకాలూ విశేష్యాలేగాక మిగత మాటలుకూడ వస్తాయి. - చిన్నమ్మకథ, పెద్ద బొబ్బిలిరాజుకథ ఇత్యాదులు. ఇంకోరీతి ఏమంటే చరణం చివర 'సై' అని వస్తుంది. ఇది అరుమరాశిల కథలో ఉంది. "అప్పుడు ఓరితమ్ముడా సై. మా పట్నము చేరినవారికి సై."

మరికొన్ని జంగంకథలలో అసలు ఏ ఊతా పదమూ ఉండదు. నల్లతంగాళ్ కథ, దేశింగురాజు కథ, పల్నాటి వీరచరిత్ర మొదలైనవి.

### గ్రంథాది నుండే పద్యాలు

ఈ జంగం కథలకి వృత్తాది పద్యాలకి సంబంధమే లేదు. వీటిపద్ధతేవేరు. వీటిలో కొన్నిటిలో దైవస్తుతి కూడ కనబడదు. కవి కథను హఠాత్తుగా మొదలు పెడతాడు; ఉదా:- బాలనాగమ్మకథ, చిన్నమ్మకథ, కామమ్మకథ, బంగారుతిమ్మరాజు కథ ఇత్యాదులు. జంగంకథ ప్రారంభంలో నల్లతంగాళ్ కథలోకూడ స్తుతి పంక్తులులేవు. పెద్దబొబ్బిలి రాజు కథ, దేశింగు రాజుకథ, సన్యాసమ్మకథలలో కొంచెంగా స్తుతి చరణాలున్నాయి. అటువంటి స్థితిలో గ్రంథాది నిస్తుతి పద్యాలు ఇతరులు అంటే ఇటీవల జంగం పాటకులులేక ప్రకాశకులు చేర్చినవని చెప్పవచ్చు; పైగా కొన్నిటిలో ఈ పద్యాలన్నీ ఒకే మోస్తరుగా ఉన్నాయి. సాధారణంగా ఈ కథలలో గ్రంథాంతమందు ఫలశ్రుతి ఉంటుంది. అటువంటి సందర్భంలో గ్రంథాదిని స్తుతిపద్యాలతోనే ఫలశ్రుతి పద్యాలుకూడ ఉంటాయి. ఇదంతా కూటమని రుజువు చేస్తోంది. పైగా ఈ పద్యాలు కంటిగా అసహ్యంగా ఉంటాయి. వీటిని జంగం

కథలను నిర్మించినవారికి అంటకట్టడం సబబు కాదు. ఈ రకమైన పద్యాలు దేశింగురాజు, కాంభోజరాజు, నల్లతంగాళ్, పెద్దబొబ్బిలిరాజు కథలలో ఉన్నాయి. అవి ప్రక్షిప్తాలుగా భావించవచ్చు.

జంగం కథలు రాసిన కవులపేర్లు సక్రుతుగా తెలుస్తున్నాయి. అది సాధారణంగా కథ చివర ఉంటాయి. కాంభోజరాజుకథయొక్క కవి జంగం సుబ్బయ్యదేవర. చిన్నమ్మకథ నిర్మాత చెంగల్వ రాజు. మిగత వాటిలో కనబడడంలేదు. అది కవి దోషంకాదు. కవి సాధారణంగా కథాంతమందు తన పేరును చెప్పుకొనే వాడుక ఉంది. కాబట్టి మనం అనేక ప్రతులను పరిశీలిస్తే ఒక్కొక్కప్పుడు ఆ పేర్లు బైటపడవచ్చు. ఒక్కొకప్పుడు ఆ జంగం కథను పాడినవ్యక్తి వేరే పొరపాటున దీనిలో చేరిపో వచ్చు. కాబట్టి దీనికి పరిశోధన అవసరం.

## జంగంకథ రచనాకాలం

జంగంకథ ఎప్పుడు రచింపబడుతుంది అనేది ఒక ప్రశ్నగా తోచవచ్చు. కాని ఇది నిజంగా ప్రశ్నే కాదు. ఎందుచేతంటే జంగం కథలన్నీ లోకంలో యథార్థంగా జరిగినవాటిమీద కొంతవరకు ఆధార పడుతుంటాయి. ఆ ఘటన జరిగినప్పుడే మనుష్యుల మనస్సులలో ఉద్రేకం తాజాగా ఉంటుంది. కవి మనస్సులో కావ్యం ఉద్భవిస్తుంది. భావకవిత్వం (Lyric) ఎట్లాంటిదో ఇదీ అట్లాంటిదే. ఘటనకి, రచనకి కాలభేదం చెప్పతగినంత ఉండదు. కథ జరిగిన కొన్ని శతాబ్దాలకి ఎవరికో ఒకరికి ఉద్రేకం పుట్టి రచింపబడిన కావ్యాలు కానేకావు; ఇవి ఐతిహాసిక రచనలని స్థూలంగా చెప్పవచ్చు. అయితే ఒకటి, ఆ తర్వాత ఎవరెవరో కొన్ని చిన్న మార్పులు చేస్తూండడానికి కొంచెం అవకాశముంది. అటువంటి మార్పులైనా జరగడానికి అవకాశాలు మొత్తంమీద తక్కువే. చేస్తే ఆ మార్పులను పాటలు పాడేవాళ్లు చెయ్యవలసిందే. ఎందుచేతంటే ఈ పాటలు లిఖితరూపాన్నిగాక ఒకరి దగ్గరనుంచి ఒకరు చెప్పించుకొని పాడుకొనేవిగానే ఉండేవి. కాబట్టి పోషకులు స్వతంత్రించి తమకు తెలియనటువంటి మాటలను తీసివేసి తెలిసిన మాటలను చేర్చే వారని స్థూలంగా చెప్పవచ్చు. ఇటువంటి ప్రక్షిప్తాలు అక్కడ అక్కడా కనబడుతుంటాయి.

## పాటగాళ్ల కులాలు

జంగం కథలను పాడేవారు అన్ని ప్రాంతాల లోను ఉన్నారు. వారు పాడి తమ జీవనోపాధిని సంపాదించుకొంటారు. జంగాలు, జక్కులు, బవనీలు ఇత్యాది కులాలవారున్నారు. వీరు తంబురా, రుంజ, చేతికడియాలు మొదలైన వాద్యాలతోకూడ పాటను పాడుతూ, మధ్య మధ్య నటిస్తూ, ప్రేక్షకుల అభిరుచిని చూరగొంటారు. సుమారుగా పదునాలుగో శతాబ్దాంతమందు రచింపబడ్డ క్రీడాభిరామంలో పల్నాటి వీరుల కథను కొందరు పాడేరనీ, ఏకవీరాదేవత ఎదుట పరశురాముని కథలను బవనీలు పాడేరనీ శ్రీనాథమహాకవి తెలియజేసేడు.

గేయాలను పాడేటప్పుడు స్త్రీలు వల్లకి, చక్కి, కాహళము, వంశము, ఢక్క, హుడుక్క, ఝల్లరి మొదలైన వాద్య విశేషాలను వాడేవారని శ్రీనాథ కవి భీమ ఖండంలో ఇట్లు తెలియజేశారు.

ఉ. వల్లకి, చక్కి, కాహళము
వంశము, ఢక్క, హుడుక్క, ఝర్ఝరుల్
ఝల్లరి యాదిగా గలుగు
శబ్దపరంపర తాళబద్ధమై
యుల్లసిలం ప్రబంధముల
నొప్పుగ నాడుదు రుగ్రవేదిపై
బల్లవపాణు లీశ్వరుని
పంటమహీశులు పూజసేయగన్.

## జంగం కథల సాధారణ లక్షణాలు

జంగంకథ లన్నిటిలోను కొన్ని సమాన లక్షణాలు కనబడతాయి. ఇవి ఈ శాఖయొక్క విశిష్టతను ప్రకటిస్తున్నాయి. వాటిని ఈ క్రింద వివరంగా తెలియజేస్తాను.

## ఏక వీరుడు లేక ఏకనాయకుడు

జంగం కథలలో మనం సాధారణంగా చెప్పుకొనే రీతిగా నాయకానాయకులుండరు. ఇవి ఏక పాత్ర ప్రధానాలని చెప్పవచ్చును. అతడే నాయకుడు. స్త్రీ అయితే నాయిక.

కాంభోజరాజు కథలో చెరబందిరాజు ప్రధానమైనవాడు. అతనుముగ్గురు స్త్రీలను పెండ్లాడేడు. కాని వారు తక్కిన అందరిలాంటి పాత్రలే! చెరబందిరాజు పాత్రకోసమే తక్కినవారు వచ్చి పోతూన్నట్లుగా కానబడుతూంది. ఏకవీరుడు ప్రధానమైన గ్రంథాలంటే దానిభావమది. పల్నాటి వీర చరిత్రలో కూడ అనేక పాత్రలున్నా బాలచంద్రుడు తతిమ వారికంటే ఘనుడుగా చిత్రింపబడతాడు.

స్త్రీపాత్ర ప్రధానంగా ఉన్న కథలలో కూడ పద్ధతి ఇదే. చిన్నమ్మ కథలో చిన్నమ్మ కడుముఖ్యురాలు. ఆమె భర్తలో ఆమెకి భర్తగా ఉండతగ్గ గుణాలు లేవు. అతను అందరిలోను ఒకడు మాత్రమే! సన్యాసమ్మ కథలో సన్యాసమ్మ ముఖ్యపాత్ర కాబట్టి కథకి ఆమె పేరే పెట్టబడింది. మిగత పాత్రలన్నీ ఆమె ఆధారంగా తిరుగుతూంటాయి. కామమ్మ కథలోనూ అంతే. చనిపోయిన మారన్న దానిలో ఒక పాత్ర. నల్లతంగాళ్ కథలో నల్లతంగాళ్ ముఖ్యురాలు. ఆమెభర్త పేరుకి మాత్రమే! కాబట్టి ఈ కథలలో నాయకా నాయకులిద్దరికీ ప్రాముఖ్యత ఉండదు. ఎవరో ఒక్కరే ప్రధానులు. రెండోవారు లోకంతోపాటే!

చారిత్రక 'కథలుకూడ ఏకపాత్ర ప్రధానాలే! బంగారు తిమ్మరాజు కథలో కథంతటికీ బంగారు తిమ్మరాజు ప్రధానుడు. అతన్ని అనుసరించుకొని మిగత పాత్రలున్నాయి. ఇల్లే దేశింగురాజు కథ మొదలైన వాటిలో. కాని ఈ కథలకి కాంభోజరాజుకథ, బాలనాగమ్మ కథకి ఒక పెద్దతేడా ఉంది. ఈ కథలలో రాజకుమారుడు దేశసంచారం చేస్తూ పెళ్లిళ్లు చేసుకోడు, ఇతను యుద్ధవీరుడు. కార్య సాధనలో తన జీవితాన్ని అర్పిస్తాడు. ఇవి విషాదగాథలు. పెద్ద బొబ్బిలి రాజుకథకూడ ఈ ఫక్కనే నడిచింది. ఈ కథలో రంగారావు పాత్ర ప్రధానమైనదే. కాని రాజు చెప్పినట్లు ఇతరులు గాక, ఇతరులు చెప్పినట్లు రాజు వర్తించుకోవలసి వస్తుంది. అంతమందు నాశనం తక్కిన కథలలాగే!

## ఏకనాయకుని అద్భుతజననం

ఏక నాయకుడు మహిమాన్వితుడై ఉంటే కాని అసామాన్య కార్యాలు చెయ్యలేడు అని జంగం కథలలో ఒక సంప్రదాయం. కాబట్టి ఈ ఏక వీరుని పుట్టుక పూర్వంనుంచీ కవి పెద్ద కల్పన చేసుకొంటూ వస్తాడు. ఇటువంటి మహాపురుషుని పుట్టుక మామూలు పుట్టుకలాగుండదు. కాంభోజరాజుకి సంతానంలేదు. ఈకథలో రాజు అనేక వ్రతాదులు చేస్తాడు. ఎన్ని దానధర్మాలు చేసినా సంతానంలేదు. మాణిక్యదేవి చెరబెట్టబడుతుంది. చెరలో ఈశ్వరుడు వరమిస్తాడు. ఆమె కుమారునికంటుంది. నల్లతంగాళ్ కథలోకూడ నల్లతంగాళ్ తల్లిదండ్రులు తపస్సు చేసి నల్లతంగాళ్ని కంటారు. చిన్నమ్మకథలో నరసింహస్వామి దయవల్ల చిన్నమ్మ జన్మిస్తుంది. బాలనాగమ్మ కథలో కూడ బాలనాగమ్మ తలిదండ్రులకు సంతానంలేదు. తల్లి అరణ్యాలకుపోయి తపస్సుచేస్తుంది. చివరకి బాలనాగమ్మ జన్మిస్తుంది. బాలచంద్రుని పుట్టుక కూడ మహిమలోకూడినదే! బంగారు తిమ్మరాజు కథలోకూడ తలిదండ్రులు ఏడు సంవత్సరాలు ఘోరమైన తపస్సు చేసి బంగారు తిమ్మరాజును కంటారు. ఈ కథలకి ఇదొక సామాన్య లక్షణంగా భావించవచ్చు.

## ఏకనాయకుని అద్భుతబాల్యం

కథానాయకుడు అతిలోక పురుషుడుగా ఉంటే కాని ఘనకార్యాలు చెయ్యలేడు కాబట్టి కాంభోజ రాజకథలో చెరబందిరాజు జన్మించిన వెంటనే దేవతలు అతన్ని తీసుకుపోయి పెంచి పెద్దచేస్తారు. కథానాయకుడు పన్నెండేళ్లలోనే సకల విద్యాపారంగతుడయిపోతాడు. బాలనాగమ్మ కొడుకు పసితనంలోనే సకలవిద్యలలో ఆరి తేర

(తరువాత 265వ పేజీలో)

# విండర్ మియర్ సతి విసనకర్ర

రచయిత :
ఆస్కార్ వైల్డ్

అనువాదం :
సో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.

నాటక పాత్రలు :

విండర్ మియర్ ప్రభువు
డార్లింగ్టన్ ప్రభువు
అగస్టస్ లార్టన్ ప్రభువు
డంబీ
సిసిల్ గ్రహాం
హాప్పర్
పార్కర్, బట్లర్.

స్త్రీలు

విండర్ మియర్ సతి
బెర్రిక్ రాణి
అగాతా కార్లైల్ కుమారి
ప్లిండేల్ సతి
స్టట్ ఫీల్డ్ సతి
జెడ్ బరో సతి
మిసెస్ కూపర్-కూపర్
మిసెస్ ఎర్లిన్
రోజలీ, పనికత్తె.

—o—

## మొదటి అంకం

[కార్ల్టన్ హౌస్ టెర్రేస్ లోని విండర్ మియర్ ప్రభువు భవనంలో ఉదయకాలం వెళ్లబుచ్చేగది. సి. ఆర్ అనే రెండు తలుపులుంటాయి. ఆర్ అనే పుస్తకాల బీరువా ఒకటి ఉంటుంది. సోఫా, దానికి ముందు ఒక చిన్నటీ టేబిలూ 'ఎల్' ఉంటాయి. డాబావైపు ఎల్ అనే కిటికీ ఉంటుంది. 'ఆర్' అనే టేబులుంటుంది.]

[విండర్ మియర్ సతి 'ఆర్' టేబిల్ దగ్గర ఒక నీల పాత్రలో గులాబీ పువ్వుల్ని అమరుస్తూ ఉంటుంది. పార్కర్ ప్రవేశం.]

పార్కర్:-అమ్మగారు ఇవేళ మధ్యాహ్నం ఇంట్లో ఉన్నట్లేనా అండి?

విండర్ మియర్ సతి:-ఔను - ఎవరొచ్చేరు?

పా:-డార్లింగ్టన్ ప్రభువుగారు, అమ్మగారూ.

విం.స:-(తటపటాయించి)ఆయన్ని పైకి తీసుకురా - ఎవరొచ్చినా నేనింట్లో ఉన్నానని చెప్పు.

పా:-చిత్తం, అమ్మగారూ! ('సి' గుండా నిష్క్రమిస్తాడు)

విం స:-రాత్రికి ముందుగా ఆయన్ని చూడడం చాలా మంచిది. ఆయన రావడం నాకు చాలా సంతోషం.

['సి' గుండా పార్కర్ ప్రవేశం.]

పా:-డార్లింగ్టన్ ప్రభువుగారు.

'సి' గుండా డార్లింగ్టన్ ప్రభువు ప్రవేశం

[పార్కర్ నిష్క్రమిస్తాడు]

డార్లింగ్టన్ ప్ర:-విండర్‌మియర్ సతిగారు కులాసాగా ఉన్నట్లేనా ?

విం.స:-డార్లింగ్టన్ ప్రభువుగారు క్షేమంగా ఉన్నారా? మీచేత నిగ్రహించలేని పరిస్థితిలో ఉన్నా. ఈ గులాబీ పూల వల్ల నాచేతులు తడిసిపోయాయి. ఇవి రమ్యంగా లేవు? సెల్బీనుంచి ఇవేళ పొద్దున్నే వచ్చేయి.

డా.ప్ర:-పసందుగా ఉన్నాయి. (టేబిల్ మీదఉన్న విసనకర్రని చూస్తాడు) ఏమి అందమైన విసనకర్ర! నేను దీనిని చూడవచ్చా?

విం.స:-నిస్సందేహంగా. చాలా ముచ్చటగా ఉందికదూ! దానిమీద నా పేరు చెక్కి ఉంది. నేనూ దానిని ఇప్పుడే చూసేను. నా పుట్టినరోజు పండగనాడు మావారు నాకిచ్చిన బహుమతి. మీకు తెలుసా, ఈ వేళ నేను పుట్టినరోజు?

డా.ప్ర:-నాకు తెలియదే-నిజంగానా?

విం.స:-అవును, ఈవేళ నేను వయోపరిపక్వానికి వచ్చేను. నా జీవితంలో చాలా ముఖ్యమైన రోజు, కాదూ? అందుచేతే ఈవేళ రాత్రి విందు ఏర్పాటు చేసేను (పువ్వుల్ని ఇంకా సర్దుతూనే ఉంటుంది.)

డా.ప్ర:-(కూర్చుంటూ) ఇవేళ మీ జన్మదినమని నాకిదివరకే తెలిసుంటే ఎంతో బాగుండేది. మీ యింటికి ఎదురుగుండా ఉన్న బాటని గులాబీపూలతో నింపేవాడిని, వాటిమీదే ఎంత మాత్రమూ నొవ్వక మీరు నడిచి ఉండేవారు! గులాబీలు లోకంలో మీకోసమే సృష్టించబడ్డాయి.

(కొంతసేపు నిశ్శబ్దం)

విం.స:-డార్లింగ్టన్‌ప్రభూ! నిన్న రాత్రి ఫారన్ ఆఫీసులో నాకు చాలా చీకాకు కలిగించేరు. మళ్ళా-నాకు చీకాకు కలిగించబోతారని నాకు జంకుగా ఉన్నది.

డా.ప్ర: నేనా విండర్‌మియర్ సతీ?

'సి' గుండా పార్కర్, సేవకుడు టీట్రేతోటీ, తినుబండాలతోటీ, ప్రవేశిస్తాడు.

విం.స:-పార్కర్, వాటి నక్కడఉంచి వెళ్లు.

[టేబురుమాలుతో చేతుల్ని తుడుచుకొని, 'ఎల్' టేబిల్ దగ్గరకివెళ్ళి కూర్చుంటుంది)

డార్లింగ్టన్‌ప్రభూ! ! మీరిక్కడికిరారూ?

[పార్కర్ 'సి' గుండా వెళ్లిపోతాడు.]

డార్లింగ్టన్ ప్రభువు (కుర్చీతీసుకొని 'ఎల్‌సీ' గుండా వెడతాడు) : నాకు చాలా విచారంగా ఉంది. నేనేమి తప్పుచేసేనో చెప్పండి. ('ఎల్' టేబిల్ దగ్గర కూర్చుంటాడు)

విం.స:-సాయంత్రం అంతా మీరు నన్ను తెగపొగుడుతూవచ్చేరు.

డా.ప్ర:-(చిరునవ్వుతో) ఈ కాలంలో మనం ఏదీచెయ్యడానికీ అశక్తులమై యున్నాం

పొగడ్త తప్పిస్తే ఇంకేవిధమైన మంచీ మనం చెయ్యలేమని నాకు తోస్తుంది.

విం.స:-(తలపంకిస్తూ) ఉహుం, నేను నిజం చెబుతున్నా, మీరు నవ్వకండి. నేను నవ్వులాటాలకి అంటంలేను. నాకు పొగడ్త అంతే గిట్టదు. హృదయ పూర్వకంగా కాకుండా బుడిబుడి మాటల్తో తాను మాట్లాడుతున్న స్త్రీ సదభిప్రాయాన్ని పొందగలుగుతున్నానని పురుషుడు ఎందుకనుకోవాలో నాకు తెలీడంలేదు.

డా.ప్ర:-అబ్బే వాటిని నేను హృదయ పూర్వకంగానే అన్నాను (ఆమె ఇస్తున్న టీ అందుకుంటూ)

విం.స:-(తీవ్రంగా) నేనలాగనుకోను. నేను మీతో కలహించవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను. నేను మిమ్మల్ని ఆదరిస్తూ ఉన్నానని ఎప్పుడో మీకు తెలుసు. ఇతర పురుషుల్లాగే మీరూ ఉండేలాగుంటే నేను మిమ్మల్ని అంత ఆదరణతో చూచేదాన్ని కాను. చాలా మంది పురుషులకంటె మీరు ఎంతో మెరుగు అని నాకు తెలుసు. మీ నడత సవ్యంగా లేదని ఇతరులకి తోచే టట్లుగా మీరు అప్పుడప్పుడు నటిస్తూ ఉంటారు.

డా.ప్ర:-ఒకొక్కరికీ ఒకొక్క బాబు ంటూనే ఉంటుందిగదా.

విం.స:-దానినే ప్రత్యేక విషయంగా ఎందుకు పరిగ్రహించాలి?

['ఎల్' టేబిల్ దగ్గిరే కూర్చుని ఉ

డా.ప్ర:-(కదలకుండా) సంఘం బోతే ఇప్పుడు ప్రతీవ్య ఉన్నట్లుగానే నటిస్తాడు. అందుచేత చెడుగ్గా ఉన్నట్లుగా తోపజేయడం ఆ వ్యక్తియొక్క నిజాయితీ, సత్యసంధత నీ తెలియజేస్తుంది. అదీగాక మరొక విషయం. మీరు మంచిగా నటిస్తే లోకం మిమ్మల్ని నమ్మేస్తుంది. సదా మనుష్యులలో మంచితనాన్నే కోరే మన తెలివితక్కువతనమే దీనికి ముఖ్య కారణం.

విం.స:-అలాగైతే లోకం మిమ్మల్ని నమ్మ కూడదనా మీ ఉద్దేశం?

డా.ప్ర:-అవును, నాకు లోకంతో సంబంధంలేదు. లోకం ఎవర్ని నమ్ముతుంది? మందమతుల్ని, మఠాధికారుల దగ్గిర నుండి కబుర్లు పోగులవరకూగల సిబ్బందిని. మీరు నేను చెప్పే విషయాన్ని నిజంగా నమ్మాలి. ఇంకెవ్వరు నమ్మక పోయినా లోకంలో మీరొక్కరు మాత్రం నమ్మితేచాలు.

విం.స:-ఏం, నేను మాత్రం ఏం?

డార్లింగ్టన్ ప్రభువు తటపటాయించి మనిద్దరమూ అత్యంత సన్నిహితులైనందు వల్ల మనస్నేహాన్ని బలపరచుకుందాం. ఎప్పుడో

ప్పుడు విశ్వాసపాత్రుడైన ఒక స్నేహి హాయం మీరు కోరవలసి యుం

లాగనడానికి కారణం?

ఏమీ లేదు - అప్పుడప్పుడు మిత్రుల సహాయం అవసరం ఉంటుందిగదా.

విం.స:-డ్లారింగ్టన్ ప్రభూ, మన స్నేహం చాలా గాఢమైనదని ఇంతవరకూ నేను అనుకుంటూనే ఉన్నాను. మనస్నేహం అలాగే ఉంటుంది మీరుగాని!

డా.ప్ర:-కాని?

విం.స:-నన్ను గురించి తేనిపోని సంగతుల్ని చెప్పకుండాఉంటే, నేను ఛాందసురాలినని మీరు అనుకుంటున్నారు గదూ? అవును, నేను ఛాందసురాలినే. నన్ను అలాగే పెంచేరు. నేను అందుకు గర్వపడుతున్నా కూడా. నేను బొత్తిగా చంటిపిల్లగా ఉన్నప్పుడే మా అమ్మ చనిపోయింది. మా మేనత్త జూలియా సతితో ఉంటూవచ్చేననే సంగతి మీకు తెలుసు. ఆమె నన్ను కఠినంగా శాసిస్తూవచ్చేది. అయితే ఒకటి, ఇప్పుడు లోకం మర్చిపోతున్న విషయాన్ని, మంచికీ చెడుగుకీ మధ్యగల వ్యత్యాసాన్ని, ఆమె నాకు క్షుణ్ణంగా బోధపరిచింది. ఆమె నన్ను ఏతప్పునీ చెయ్యనివ్వలేదు. నేనూ ఏవిధమైన లోపాన్నీ క్షమించను.

డా.ప్ర:-విండర్ మియర్ సతీ!

విం.స:-(సోఫామీద జార్లాబడుతూ) నేను పూర్వాచారపరాయణ అని మీరనుకుంటున్నారు. అవును, నిజమే! ఈ కాలపు ఆచారాలు నాకు సుతరాం నచ్చవు.

డా.ప్ర:-ఈకాలం చెడ్డదా?

విం.స:-అవును. ప్రస్తుతం ప్రజలు జీవితాన్ని ఒక దూడల బేరంగా చూస్తున్నారు. జీవితం బేరంలాటిది కానేకాదు. అది చాలా పవిత్రవంతమైనది. ప్రేమ దానికి పరమావధి, త్యాగం దానిని పునీతం చేస్తుంది.

డా.ప్ర:-(నవ్వుతూ) త్యాగంకంటే మేలైనదింకోటేదీ లేదా? ప్రజలకి త్యాగం చేసుకోవలసిన కర్మమేమిటి?

విం.స: (ముందుకివంగి) అలాగనకండి.

డా.ప్ర:-నేను తప్పకుండా అంటాను. నాకు అలాగే తోస్తుంది. నాకు తెలుసు కూడా.

[పార్కర్ 'సి' గుండా ప్రవేశం]

పార్కర్:-ఇవేళ రాత్రికి డాబామీద తివాసీలు పరచాలా అని నౌఖరులడుగుతున్నారు, అమ్మగారూ!

విం.స:-డార్లింగ్టన్ ప్రభూ, ఇవేళ వాన కురుస్తుందంటారా?

డా.ప్ర:-మీ జన్మదినాన్ని వాన కురవడం నేనెంత మాత్రమూ సహించను.

విం.స:-సరే, వాటిని తక్షణం పరచమని చెప్పు పార్కర్.

['సి' గుండా పార్కర్ నిష్క్రమిస్తాడు]

డా.ప్ర:-(కదలకుండా) సరేకాని ఈవిషయం చెప్పండి. అయితే నేను ఒక ఊహా దృష్టాంతాన్ని తెలియజేస్తున్నాను. ఒక జంటకి పెళ్లయ్యి రెండేరెండు ఏళ్లు అయ్యాయి అనుకోండి. ఇంతలోగా లోకనిందకు పాల్పడి పలువురచేత కులట అనిపించుకునే ఒక స్త్రీ వలలో భర్త చిక్కి, ఆమెతోటే ఎక్కడబడితే అక్కడ తిరుగుతూ, ఆమెకు అడుగు మడుగు లొత్తుతూ ఉంటే, భార్య తన నిరాశని వేరే విధంగా భర్తీచేసు కోవడం తప్పంటారా?

విం.స:-(కోపంతో) నిరాశని భర్తీచేసు కోవడమా?

డా.ప్ర:-అవును, ఆమె అలాగ చెయ్య వలసిందే, ఆమెకు అలాగ చేసేహక్కు కూడా ఉన్నది.

విం.స:-భర్త చెడుతిరుగుళ్లు తిరిగితే భార్య కూడా చెడిపోవాలా?

డా.ప్ర:-చెడుతిరుగుళ్లు అనేపదం చాలా ఘాటుగా ఉన్నది.

విం.స:-ఆ విషయం చాలా భయంకరమైనది డార్లింగ్టన్ ప్రభూ!

డా.ప్ర:-మంచివాళ్లు లోకానికి తీరని చెడుగు చేస్తున్నారనేది నామతం. చెడుగుని పెద్దదానిగా చూపడమే చెప్పరాని హాని. వ్యక్తుల్ని మంచి, చెడ్డగా విభ జించడం తెలివితక్కువ పని. హృద యాన్ని రంజింపజేసేవాళ్లు, చీకాకు కలి గించేవాళ్లు అని రెండు విధాలుగా వ్యక్తుల్ని విభజించాలి. హృదయాన్ని రంజించేవాళ్ళ తరఫున నేను మాట్లా డుతున్నాను. మీరు విండర్ మియర్ సతీ, మీరు ఈ తెగకి చేరక తప్పదు.

వి.స:-సరే ఉండండి (లేచి అతని ఎదు రుగాఉన్న 'ఆర్'ని దాటి) కదలకండి. ఆ పువ్వుల పనిని పూర్తి చెయ్యాలి, అంతే.

[ఆర్. సీ. టేబిల్ దగ్గరికి వెడుతుంది]

డా.ప్ర:-(లేచి కుర్చీని కదుపుతూ) ఆధునిక జీవితం అంటే మీకు వెగటుగా ఉందని నేను అనక తప్పదు. అందులో ఎన్నో లోటులున్నమాటకూడా నిజమేనని నేను ఒప్పుకుంటాను. ఈ కాలపు స్త్రీలు చాలావరకూ డబ్బుమీదే వ్యామోహం చూపిస్తున్నారు.

విం.స: వాళ్లని గురించి మాట్లాడకండి.

డా.ప్ర:-ధనవ్యామోహితులైన స్త్రీ లు మినహా, లోకపుదృష్టి, లోకాలు జారి నట్లుగా పరిగణింపబడే స్త్రీలు సహితం

నిందార్హులే, ఎంతమాత్రమూ క్షంత
వ్యులుకారని మీరు అనుకుంటూరా?

విం.స:-(టేబిల్ దగ్గిర నిలబడుతూ) అవును. ఎంత మాత్రమూ క్షంతవ్యులు కారు.

డా.ప్ర:-పురుషులో? స్త్రీలకి అనువర్తించే న్యాయమే పురుషులికీ అనువర్తించాలా?

విం.స:-తప్పకుండా!

డా.ప్ర:-ఈ చిల్లర మల్లర చట్టాలతోటే, నియమాలతోటే జీవితాన్ని నిర్బంధించ ప్రయత్నించడం ఒక మహాసముద్రాన్ని కుండలో ఇరికించడానికి ప్రయత్నించినట్లే.

విం.స:-ఈ చిల్లరమల్లర చట్టాలూ నియమాలూ మనం గమనిస్తే జీవితం ఎంతో సాఫీగా గడిచిపోతుంది.

డా.ప:-ఎక్కడో ఒక చోట కొద్దిగా దోవ తప్పడం జరగవచ్చుగదా?

విం.స:-దోవతప్పడానికి వీలులేదు.

డా.ప్ర:-అబ్బా, ఎంత నియమబద్ధమైన జీవితమండీ మీది?

[పార్కర్ 'సి' గుండా ప్రవేశిస్తాడు]

పార్కర్:-బెర్రిక్ రాణీ, అగాతా కార్లైల్ కుమారి వచ్చారండీ.

[బెర్రిక్ రాణి, అగాతా కార్లైల్ కుమారి ప్రవేశం]

బెర్రిక్ రాణి:-(కరస్పర్శచేస్తూ) మార్గరెట్, ఎంతకాలానికి నిన్ను చూసేను! మీకు అగాతా తెలుసుకదూ? (ఎల్. సి దాటి) డార్లింగ్టన్ ప్రభువూ, కులాసాయేనా? నా కూతుర్ని మాత్రం మీకు పరిచయం చెయ్యను, మీరు చాలా చెడ్డవారు కాబట్టి.

డా.ప్ర:-అలాగనకండి రాణీగారూ నేను చెడ్డవాడిగా విజయం పొందలేను. నేను నాజీవితంలో ఇంతవరకూ ఏచిన్నపొరపాటూ చెయ్యలేదన్నీ ఎంతోమంది అంటూవుంటారే. ఆ అనేవాళ్లు నేను లేనప్పుడే అంటూ వుంటారులెండి!

బె.రా:-దేవాంతకుడు వే! అగాతా, ఈయనే డార్లింగ్టన్ ప్రభువు. ఆయన చెప్పేమాటని దేనిని నమ్మకు సుమా (డార్లింగ్టన్ ఆర్. సిని దాటును) అబ్బే, టీ వద్దమ్మా (ముందుకువెళ్లి సోఫాలో కూర్చుంటుంది.) మార్క్బ్యసతిగారింట్లో ఇప్పుడే టీ పుచ్చుకుని వచ్చేము. అబ్బా, ఆ టీ ఏమీసహించలేదు. అందులో ఆశ్చర్యమేమీ లేదు. ఆవిడగారి అల్లుడే ఆ టీని సప్లయిచేస్తున్నాడట. అగాతా ఈ బాలుకి రావాలని ఎంత ఉబలాటపడుతుందనుకున్నారు.

విం.స:-ఇది అంత పెద్దబాలేమీకాదులెండి. నా పుట్టినరోజు జ్ఞాపకార్థం ఓ చిన్న డ్యాన్సులెండి. త్వరగాకూడా అయిపోతుంది.

(సశేషము)

# పెండ్లిప్రయత్నం

సుధ తండ్రి నెలకో వంద రూపాయిలు సంపాదిస్తున్నారు. ఆయనకు ఆడసంతతి ఎక్కువ. ఒక్కడే మొగబిడ్డ (వయస్సు ఆరు సంవత్సరములు.) మర్యాద గల కుటుంబం. సుధ ఆరవ కుమార్తె. చక్కదనమునకు తగినవన్నె తెచ్చేటట్టుగా మంచి గుణములుకలిగి ఆమె పెరిగి పెద్దదయింది. కాని ఆమె తండ్రి ఆమె రెండవఫారం చదువుతూ ఉండగా బడి మాన్పించి ఇంటిలోనే ఉంచినారు. తల్లి దండ్రులు అమె వివాహవిషయమై బెంగగొని, మంచివరునికొరకై వెదుక మొదలిడిరి. వారికి ఆడపిల్లలు అవివాహితలుగా ఉంటే చాల భారంగా ఉంటుందేమో? మరి ఇది. మగ పిల్లలకు వర్తించదేమి? అది 'లోకసహజము. ఎంతపెద్దచదువులు చెప్పించినా ఆడపిల్లను ఒకరి చేతుల్లో పెట్టవలసిందేకదా అని నిరాశ చెందుతారు. ఎందుకో?

సుధ అప్పటినుండి తల్లికి చేదోడు వాదోడుగా ఉండేది. అంతపనీ చేసేది. ప్రాపంచిక విషయాలలో జ్ఞానం ఆమెకు శూన్యం. ఎప్పుడయినా చదువుకుందాము అనుకొని మళ్లా "అరవై ఏళ్లు వచ్చాక చదువుకోక మన్నుకొట్టుకోనా" అని ఇన్నేళ్లు వచ్చాక నాకు చదువేమిటి? అని నిరాశచెందేది తనకున్నది పదిహేనేండ్లయినా.

కాని భగవదనుగ్రహంవల్లను, పెండ్లి కుదరక పోవటంవల్లనూ సుధ ఒకసారి తనమేనమామగారింటికి వెళ్లింది. ఒక నాడు అక్కడిబాలికా పాఠశాలనొక దానిని చూచి, అందులో చదువుకోవాలని ఆశ కలిగింది. చిట్టచివరకు ఎలాగయితేనేం అందులో చేరింది. తండ్రి మనస్సు చాలా మారిందిబోలునని సంతోషించింది. మేనమామ అత్తమ్మకూడా ఇందుల కంగీకరించారు.

సుధ మొదట్లో కొంచెం బండగా ఉన్నా త్వరగా అందుకొంది. పిల్లలతో పోటీ చేసి మంచిమార్కులు తెచ్చుకొనేది. స్కూలులో తనకంటె చాలా పెద్దవాళ్లు చదువుతున్నారని గ్రహించింది. ఇంట్లో చేసే పెట్టి చాకిరీ అంతా మర్చిపోయింది. ఆమె చదువులో నిమగ్నురాలైంది. చదువే ఆమె ప్రస్తుతదృక్పధం. చక్కగా కృషిచేసి ఆమె అందరి టీచర్ల మెప్పు వడసింది. అందరకి ఆమె అంటే చాలా ఇష్టం. ఎవ్వరితోను ఎప్పుడు పోట్లాడేది కాదు. ఆమె సహపాఠులందరు అమె చుట్టూ చేరి 'మంచి మంచి గుణాలు నేర్చుకొనే వారు. చదువులో ప్రవేశించినప్పటినుండి ఆమె మనోభావాలు వికసించినవి. ఆమె భావిజీవితం నెమ్మదిగా మొక్కయై తీగెలుప్రాకనారంభించింది. సుధ పెద్దపెద్దవారితో పరిచయము సంపాదించి, వారినుండి రాజకీయ విషయములను గ్రహించేది. సభలలోకి వెళ్లి వాగ్ధాటిలో మాట్లాడేది. అన్నింటిలోను ధైర్యసాహసాలు పెంపొందించుకున్నది.

తండ్రి ఇంకనూ పైచదువుచెప్పించెదరు కదా అని ఎన్నో గాలిలో ఆశా సౌధాలు నిర్మించింది. పెండ్లి చేసుకొన్నందువల్ల కలిగే సుఖము ఆమెకు తుచ్ఛమనిపించింది. తన పవిత్ర శరీరమును, ఇతరుల కర్పించకుండా జీవితాంతంవరకు పవిత్రంగానే బ్రహ్మచారిణిగా గడిపి దేశసేవలో ప్రాణాలు వీడాలనుకుంది. ఫ్లారెన్సునైటింగేలు లాగ బీదలకు తన శక్తి కొలది సహాయం చెయ్యాలనుకొంది. తాను జన్మఎత్తడంలో ఏదో ఒక కార్యం సాధించవలసి ఉన్నదని ఆమెకు గట్టి నమ్మకం. పెండ్లి చేసికొనిన ప్రతీస్త్రీకి పురుషునివలన ఏదో ఒక అడ్డంకి తప్పదని ఆమె నమ్మకం. అదీకాక పెండ్లిచేసుకొని నవీనయుగంలో కొందరు

స్త్రీలు, భర్తలచే విడువబడినవారై పడుచున్న పాట్లను ఆమెకళ్లారా చూచింది. అది ఎట్లా ఉన్నా పెండ్లివల్ల కలిగే శారీరక సౌఖ్యమును ఆమె సౌఖ్యముగా భావించలేదు.

...సుధ మనసులో అగ్నిరగుల్కొన్నది.

ఆమె స్కూలుఫైనలు పరీక్షముగించి శెలవ లెచ్చట గడపనా అని ఊహిస్తోంది. సెలవులలో బీదవిద్యార్థులను ప్రోగుచేసి తనకు వచ్చిన విద్యను వారికి గరపుదామనుకున్నది. అరోజుననే మేనమామను ఇంటికి తీసుకువెళ్లమని అడిగింది. ఇంకా మనస్సులో ఎన్నో ఊహాలు లేస్తోనేఉన్నవి. మునుపటి కోపంపోయి శాంతస్వభావం అలవడడంచేత తండ్రి తనను మెచ్చుకుంటారనుకున్నది.

కాని ఆ రోజునే తండ్రిదగ్గరనుండి మేనమామకు సుధ సంబంధం విషయంలో రెండు రోజులలో వరుడు, తండ్రి, పిల్లను చూడడానికి పట్నంవస్తారని ఉత్తరంవచ్చింది. మేనమామ సుధకు ఈ విషయం చెప్పి ఉత్తరం చూపాడు. కలలోనయినా తలపెట్టని తండ్రి జాబుచూచి, సుధగదిలోకి పోయి రోజంతా ఏడ్చింది. ఎల్లాగయినా ప్రయత్నంచేసి తండ్రి మనస్సు మార్చివేయాలనుకుంది. తండ్రి ఉద్దేశ్యం తెలియకుండా గాలిలో మేడలుకట్టటం తనదే తప్పనుకుంది. అందుచే తనఉద్దేశ్యములను ముభావంగా తెలుపుతూతండ్రికొక ఉత్తరం వ్రాసింది. కాని జవాబువచ్చేందుకు వ్యవధిలేదు.

మూడవనాడు వరుడు, వరునితండ్రి పట్నం వచ్చారు. సుధ మేనమామ పెద్ద అట్టహాసంతోవారిని సత్కరించాడు. సుధకు ఇష్టంలేకపోయినా తన అయిష్టాన్ని వారికి మరొకవిధంగా తెల్పవచ్చునని మామూలు డ్రస్సుతో వెళ్లింది. వరునివైపుకన్నెత్తి కూడా చూడలేదు. మాటలలో సుధ పెండ్లికొడుకు తండ్రితో "స్త్రీకికూడా సమయిమిస్తే స్త్రీ పురుషునితో సమానమయినదని నిరూపించగలదు వారికి కట్నం ఇచ్చి పెండ్లి చేయవలసిన అవసరంలేదు" అంది. దానికి ఆయన "ఏమమ్మా నీకు ఇప్పుడు పెండ్లి అంటే ఇష్టంలేదా? చదువుకోవలెనని ఉందా? వెళ్లమ్మా చదువుకో - నాపిల్లలు కూడా M.Sc,B.Sc. చదువుచున్నారు" అన్నాడు. అప్పుడు సుధ "మీరు సైకాలజిష్టులాగ నా ఇష్టాయిష్టాలను త్వరగా కనిపెట్టారే" అంటూ చిరునవ్వునవ్వి వెళ్లిపోయింది. పెండ్లి కొడుకు నిర్ఘాంతపోయాడు. తాను కూడా చాలా ధీమాగా వెళ్లిపోయాడు. మేనమామ సుధ తనను వారిని అవమానించినదని మండిపడ్డాడు.

సుధ పీడ వదిలిందిరా భగవంతుడా అని తనలో తను మురిసిపోయింది. సుధ తండ్రి ఆమె ఉత్తరం చూచి సుధను బెదరిద్దామని బయల్దేరి ఆ రోజు సాయంత్రాని కక్కడికి వచ్చాడు. సుధ గుండెల్లో దొంగతనంచేసిన దానిలా దడదడ ఆరంభించింది. తండ్రి మాటకు ఎన్నడూ ఎదురాడి ఎరుగదు. తండ్రి గట్టిగా పట్టుపడితే ఏంచేయాలో అన్న ఆలోచనలో పడింది. ఒక రోజంతా అన్నం తినకుండా. సత్యాగ్రహం చేసింది. ఆ రాత్రి మేనమామ జరిగిన కధంతా చెప్పాడు. సుధకు తండ్రి స్వభావం బాగా తెలుసు. అందుచే తండ్రి వచ్చినా తన ముఖం చూపలేదు. పలుకరించనూలేదు. ఈ కారణాలవల్ల ఆయనకోపం మరీ హెచ్చిపోయింది. అగ్నిలో నెయ్యిపోసినట్లయింది సుధ ఏకధారగా ఏడుస్తూంది.

సుధను తండ్రి కోపంగాపిల్చి పెండ్లిచేసుకోనడంలో గల ఆమె ఉద్దేశాన్ని వివరంగా తెల్పమన్నాడు. ఆమె పొర్లిపొర్లి వచ్చే దుఃఖాన్ని ఆపుకొని చదువు చెప్పించటంలో మీకుగల ముఖ్యోద్దేశాన్ని చెప్పవలసిందిగా తండ్రిని ప్రార్థించింది.

అప్పుడాయన చదువు పెండ్లి ప్రయత్నమునకేగాని ఉద్యోగము చేయుటకు కాదని, చదువుకొన్న మంచి సంబంధం దొరకునన్న ఆశతో చదువు చెప్పించితి ననెను. అట్టి జవాబు తండ్రి నోటినుండి వచ్చునని సుధ కలలోకూడ తలపలేదు. ఆమె నోటినుండి మాటరాలేదు. కనులవెంట నీళ్లు కారుచుండెను. ఇప్పుడు తను పెండ్లిచేసుకొన ననుటకు కారణమును ఆమె చెప్పలేకపోయెను. తండ్రి మాటలకులోబడి తన జీవితాశయములనువదలి పెండ్లిచేసుకొనుటయా

లేక తండ్రి నెదిరించి తన కోర్కెలను సఫలీకృతము చేసుకొనుటయా? పెండ్లిచేసుకొనినచో భర్త ఇతరులకు సేవచేయనీయడేమో బీదలకు చదువుచెప్పుట ఒప్పుకొనడేమో? అదీకాక పెండ్లిచేసుకొనిన దేనికీ స్వేచ్ఛ ఉండదు.

తన చదువంతా వరాన్వేషణం కొరకనుకోలేదు. తన తండ్రి తన చదువునకై సుమారు రెండువేలయినా వెచ్చించి ఉంటారు. ఇప్పుడు నాలుగయిదు వేలు దాకా కట్నం. ఇదంతా పెండ్లి ప్రయత్నమేనా? వరునిలో ఏడెనిమిది వేలు కిమ్మతుచేసేదేముంది అని తన్ను తానే ప్రశ్నించుకున్నది. ఎందుచేత స్త్రీలను ఇంటిలోనుండి పరాయింటికి తరిమివేస్తారు. స్త్రీల బ్రతుకింత హీనమెందుకయింది. స్త్రీకికూడా పురుషునిలోఉండే గుణాగుణాలుకలవు. అన్నివిషయాలలోను స్త్రీదే పైచెయ్యిగాఉంది. ఆ కట్నం డబ్బుపెట్టి స్త్రీని చదివిస్తే హాయిగా స్వాతంత్ర్య జీవనం చేస్తూ తల్లిదండ్రులను సుఖపెడుతుందికదా? ఈ విధంగా ఆలోచించుకొంటూ సుధ కొంతసేపటివరకూ సమాధానం ఇవ్వలేదు. తన ఆశయాలన్నీ, తండ్రి దగ్గర చెప్పటానికి భయపడింది. కొంతసేపటికి "నాన్నగారూ ఇదంతా పెండ్లి ప్రయత్నమేనా? మగవాళ్లు బి. ఏ. ప్యాసయినా నిరుద్యోగులైఉండి భార్యాబిడ్డలను పోషించుకోలేనివారికి పెండ్లేమిటి? చదువుకోమని ఏడుస్తున్న మగవాళ్లకు చదువుల నిమిత్తము వేలుఖర్చుచేస్తారు. చదువుకుంటామని గోలచేస్తున్న స్త్రీ గోడు ఆలించేవారెవరూ కనపడరు. చదువుకుంటే చెడిపోతారని భయం. శీలం ఉంటే ఢిల్లీలో వదలినా సలక్షణంగా ఇంటికి వస్తుంది. శీలంలేని దాన్ని గదిలోపెట్టి తాళంవేసినా చేయదల్చుకున్నపని చేసే తీరుతుంది. మనం చూస్తూనే ఉన్నాముగా? ఒకరు చెడిపోయి అందరికి పేరు తెస్తారు. నాన్నగారూ! ఇష్టంలేకుండా పెండ్లిచేసి ఏమిచేస్తారు. మీలాగు పెండ్లిప్రయత్నాలుచేసి, బిడ్డల ఆశయాలను త్రుంచివేయువారు ఈ ప్రపంచంలో చాలామంది ఉన్నారనుకుంటా. కాని ఇకముందు కట్నములివ్వదలచిన డబ్బుతో కుమార్తెలకు విద్యగరిపితే వారు తమ జీవితాలను హాయిగా గడపుతారు. కట్నాలు తీసుకొనే పద్ధతిపోతే చాలామంది సుఖపడుతారని నా ఉద్దేశ్యం. అందరూ అవివాహితలుగా ఉండాలని కాదు. ఎవరిష్టమొచ్చినట్లు వారు చేయవచ్చును. నాన్నగారూ నా వివాహంకై మీరు బాధపడకండి. హాయిగా చదువు చెప్పించండి" అని సుధ 2 గంటలసేపు మాట్లాడింది. ఆమె వాగ్ధోరణికి తండ్రి చకితుడైపోయాడు. ఏమీఅనలేక చిరునవ్వు నవ్వినాడు

—— ——(o)—— ——

# రామాయణములోని లఘుపరిచిత తారలు

'తా ర'

శ్రీ మద్రామాయణ మాదికవియగు వాల్మీకి మహర్షి యమరవాణి "నా నృషిః కురుతే కావ్యమ్" అనునానుడి యప్పటి నుండీ ప్రచారానికివచ్చి యుంటుంది. చరిత్ర కందని యాదికాలమందమరభాషకుగల ప్రాధాన్యము మరొక భాషకు లేనందున సాహిత్యమంతా సంస్కృతములోనే బయలు దేరింది.

రామాయణ కథ మనోహరమైనది. అవతారమూర్తియగు శ్రీ రామ చంద్ర మూర్తి యీ కావ్యానికి ధీరోదాత్తనాయ కుడు. నాయిక సీతామహాదేవి. వీరి చరిత్ర యాద్యంతము పరిశీలిస్తే మానవ సమాజానికి కావలసిన, సాంఘికార్థిక రాజ కీయాదులు నీతినియమాదులు కండ్లకు గట్టినట్లు చూపట్టును. లోకములో మాతా పితృభక్తి చెప్పవలసివస్తే రామా దర్శమే. పాతివ్రత్యము పేరెత్తుకొగానే సీతమ్మ తల్లి తలపునకు వస్తుంది. సోదర ప్రేమ, స్వామిభక్తి, పాతివ్రత్యము, జ్ఞాతి వైరము మొదలైన మానవ జీవితము నెదుర్కొనే ప్రధాన సమస్యలన్నీ యెంతో మనోహరముగా వర్ణించారు.

"కావ్యం యశసే అర్థకృతే వ్యవహారవిదే,
శివేతర క్షతయే ।
సద్యః పరనిర్వృతయే । కాంతా సమ్మిత తయో
పదేశయుజే"

అని కావ్యప్రకాశిక. కావ్యము యశస్సు ధనము నిచ్చును. రాజకీయ పరిజ్ఞానము కలిగించును. అమంగళమును దొలగించును. ఆపాత మధురము విన్నంత మాత్రాన్నే హృదయానందముం గలిగిస్తుంది. కాంతా సమ్మితము, స్త్రీల మధురవాక్కులవలె చెవికింపు నింపుతుంది, అను కావ్యప్రయోజన మిందు నెరవేరింది.

శ్రీరామచంద్రమూర్తి పితృవాక్య పరి పాలనకు రాజ్యమునువీడి సీతా లక్ష్మణు లతో నడవులకేగి రఘువంశపు రాజుల సుగుణములలో నొకటియగు "సత్యాయ మతభాషిణాం" అను మహాకవి వాక్యాన్ని సార్థకపరచిన సత్యవ్రతుడు. సీతాపహ రణమైనవెనుక దేవిని వెదకుచు రామలక్ష్మ ణులు దండకారణ్యమంతా గాలిస్తారు.

వానర వీరుండగు సుగ్రీవుడుకూడా రాజ్యభ్రష్టుడై భార్యను గోల్పోయి, "బ్రతి కియున్న బలుసాకేరుకు తినవచ్చు"నన్నట్లు ఋష్యమూకాద్రిపై జీవయాత్ర సాగిస్తూం టాడు. ఇంతలో "పేదకు పెన్నిధి"వలె శ్రీరామదర్శనమవుతుంది, రఘు వీరుడు వానర వీరుని సఖ్యము చేస్తాడు. "వియ్యాని కి, కయ్యానికి, నెయ్యానికి సమానత్వ ముండాల"ను సామెతగా రామసుగ్రీవ మైత్రియ విచ్ఛిన్నముగా బలపడుతుంది.

వాలిసుగ్రీవు లన్నదమ్ములు. వీరిద్దరిలో వాలి దశకంఠు నంతవానిని చంక నిరికించుకొని సప్త సాగరాల్లో ముంచె త్తినట్లు పురాణాలలో వ్రాశారు. అంత బలశాలియైనందున తమ్ముని శిక్ష చేయకుండా వాని భార్య 'రుమ'తో సహా రాజ్యము లాక్కొని, సుగ్రీవుని వెళ్ళగొట్టినాడు. సుగ్రీవుడా యవమానాన్ని సహించలేక వాలి వధకు పూనుకున్నాడు. "జ్ఞాతిశ్చేదన లేనకిమ్" అను నార్యోక్తి సత్యదూరముకాలేదు. ఇంతలో రఘునాయకుని కలిమిబలిమితో వాలిని కయ్యాని కాహ్వానిస్తాడు.

వాలి భార్య తార. ఈమె సుషేణుడను వానర శ్రేష్ఠుని కుమార్తె. రాజకీయ పరిజ్ఞాత, మాట నేర్పరి, నీతికళా విశారద. రామ సుగ్రీవమైత్రిని యంగదుని వలనవిని తల్లడిల్లిపోతుంది. ఎట్లైనా భర్తను రాముబారి పడకుండా చేయాలని యెంతో ప్రయత్నిస్తుంది. కాని పోగాలము సమీపించిన వానికి హితవాక్కు లేమీ చెవికెక్కవుగదా!

తనకుగల ధీశక్తినంతా వినియోగించి ప్రాణేశ్వరుని సుగ్రీవునితో యుద్ధానికి వెళ్లకుండా చేయాలని చూస్తుంది. శత్రువు గొప్పతనము చెప్పియైనా భర్తను మరలించదలచి శ్రీరాముని దైవశక్తి నెలా వర్ణిస్తుందో చూడండి.

"నివాసవృక్షః సాధూనా। మాపన్నానాం పరాగతిః।
ఆర్తానాం సంశ్రయశ్చైవ। యశసశ్చైకభాజనమ్॥

అని వాల్మీకి రామాయణము (కిష్కింధాకాండ - 15 అధ్యాయము) ఈ శ్లోకములో శ్రీరామతత్వమంతా యిమిడింది. శ్రీరాముడు సంసార తప్తులైన సత్పురుషులకు నివాసవృక్షమైనవాడు. ఎండలోబడినవానికి చెట్లనీడ యెంతటిహాయి నిస్తుందో; సంసార పంకములో మునిగి యున్న వారికి రామాశ్రయమట్టి స్వేచ్ఛ నిస్తుంది. సుగ్రీవుని సహాయుడు నాకెట్లు వశమగునని వాలి ప్రశ్నించకుండగనే తార యుక్తిగా "సాధూనాం నివాసవృక్షః" అని చెప్పింది. తన నీడ గోరినయెట్టివారికైన నాశ్రయమిస్తుంది. అట్లే ఆత్మారాముడని భావము. "ఆపన్నానాం పరాగతిః" ఆపదలందున్న వారికి దిక్కు రాముడే. ఆశ్రిత పక్షపాతి. శరణాగత త్రాణబిరుదాంకితుడు. "నీవేతప్పనితః పరంబెరుగ"నని యాతనియందే మనోవాక్కాయములు సమర్పించి యాతనినే యుపాసించువారి యోగక్షేమ విచారణా భారమంతా వహించే భారవాహకుడు. ఇప్పుడు సుగ్రీవుని కార్య భారమంతా మీద వేసుకొని యతనికి విజయాన్ని చేకూర్చుటకు సిద్ధముగా నున్నాడు. ఇంతేకాకుండా కీర్తివంతుడు. అటువంటి యశోవిశాలుడు మరియొకడు లేడు. అటువంటి సకలలోక రక్షకుని రక్ష

ణలోనున్న సుగ్రీవుని నీవు చులకనగా జూడవద్దని హితవుపదేశిస్తుంది. ఆయన పశ్చాత్తాపానికైనా లోపమున్నదా; అంటే నిన్నగాక మొన్న విరాధుని, ఖర దూషణాది పదునాలుగువేలమంది రక్కసుల నొక్కమ్మడి సంహరించిన మేటివిలు కాడు, అతని కతడేసాటి. దుర్జయుడును మహానుభావుడైన రామునితో వైరము మానుమని నీవుకూడా తమ్మునివలెనే మైత్రిచేసికొమ్మని ప్రబోధిస్తుంది. ఇంకా సోదరప్రేమచూపి బుద్ధి మరలిద్దామని పునఃప్రయత్నము చేస్తుంది.

"ఒక్కడె నీకు తమ్ముడు గు। ణోత్తరుడా
తడువాని తుల్యునిం।
దొక్కని జూపుమీ సవినయుండును నీయెడ
నీదువంకవా।
డొక్కడగాడె; బంధువటనుండిన నియ్యెడు
నున్న చూడుమా।
కక్కస పుందనంబు కొఱగాదుసుమీ మరి
బుజ్జగింపుమా"

"అని ఒక్కగా నొక్కతమ్ముడు నీకు. నీవనిన పరమభక్తి. నీవైపు బంధువులెవ్వరు లేరు. నావంకవారునులేరు. అందువల్ల కఠినత్వము వహించుట యెంత మాత్రము తగదు. మీరిద్దరు స్నేహముగానుండి తీరాలి అని అంటుంది. మీరిద్ద రొక్క కడుపునపుట్టి యొక్కచో పెరిగి యిట్లు విరోధము వీడకపోవుట చాల విచారకరమని" సోదర ప్రేమను వృద్ధిచేస్తుంది. స్త్రీ సహజమగు మృదుస్వభావముతో హితబోధ చేస్తుంది. కాని "జాతి ప్రతిమకు చక్కిలిగింతలు"గా తారపలుకు లేమీ చెవికెక్కవు. అంతటితో తార తన దురదృష్టాన్ని నిందించుకుంటుంది. వాలి యుద్ధానికి వెళతాడు. రామబాణముతో వాలి నేలగూలుతాడు. పిడుగువంటివార్తను వినగానే తార విలపిస్తు వస్తుంది. తుపానుగాలికి నేలగూలిన మహావృక్షమువలెనున్న వాలినిగని తార యెంతో దుఃఖిస్తుంది. తమ్ముని రాజ్యభ్రష్టునిజేసి వాని భార్యను చేకొన్నందు కిటువంటి దుష్ఫలితము కలిగిందని తుదకు ధర్మనిర్ణయము చేసుకుంటుంది. ఎన్నో రీతుల నుపదేశించినా భర్త యుద్ధాన్ని విరమించనందుకు తన 'హతవిధి'ని నిందించుకుంటుంది. శూరుడైనవానికి భార్య కాకూడదని నిర్ణయిస్తుంది. శూరుని కెప్పుడు మృత్యువుతో పోరాటమే. భర్తృవియోగాన్ని భరించలేక రాముని జూచి "నన్నుగూడ నాపతికడ జేర్పు"మని విలపిస్తుంది. కాని కరుణాళుడగు రాముడు వనచర ధర్మము ననుసరించి కుమారుడగు నంగదుని జూచుకొని యానందించుమని యాశ్వాసిస్తాడు.

చివరకు రామాశీర్వాదమే ఫలించి తార సుగ్రీవుని భార్య అవుతుంది. కపిరాజ్య పట్టాభిషేకముచేసికొని సుగ్రీవుడు వర్షాకాలము రెండుమాసాలు తారా రుమలనుగూడి భోగవిలాసాలతో ప్రొద్దులు

బుచ్చుతాడు. వానరులు సీతాన్వేషణముమాట విస్మరించారని రాముడాగ్రహముతో లక్ష్మణుని సుగ్రీవుని కడకంపగా; సుగ్రీవాదులు భయకంపితులై నాలుగు మూలలకుపోయి చెట్లకొమ్మల సందున నక్కుతారు. అప్పుడు లక్ష్మణస్వామి సుగ్రీవుని నగరులోకి చొరుచుకొనబోగా; నాతని నెదుర్కొనడాని కెవరికీ సాహసము లేకపోతుంది. ధీరచిత్తయైన తార మాత్రము భయములేకుండావచ్చి లక్ష్మణుని కోపాగ్నిని చల్లార్చి శాంతింపజేస్తుంది.

"కామరతుడైన మనుజుండు గాంచునయ్య।
దేశకాలార్థ ధర్మముల్ ధీరహృదయ"

అని సుగ్రీవుని విషయాసక్తిని సున్నితముగా తెలుపుతుంది. దీనికంతకు కారణము తానేనని.

"ననుగూడి కామవృత్తం। బున లజ్జాహీను డయ్యె
బురుషాగ్రణి నీ। యనుజుని వానరవల్లభు।
ననఘా క్షమియింపుమీ దయాలంబగుణా॥"

నాయందలి వ్యామోహముచేతనే ప్రపంచమునుమరచి లజ్జావిహీనుడై యున్నాడు. అట్టి సుగ్రీవుని నీ సోదరునిగా భావించి కరుణింపుమని వేడుకుంటుంది.

వాలికొరకు విలపించి, విలపించి తన్నుగూడ చంపివేయుమని రాముని వేడుకొనిన తార కొద్దిదినములలోనే యీ విచారమంతా మరచిపోయి శృంగారావతారము ఎత్తుటచూడగా; వింతగనే తోస్తుంది. ఆ విచారమంతా కల్లిబొల్లిప్రేమ యనిపించుకుంటుంది. కాని యీమె పట్ల యట్లనుటకు వీలులేదు. వానరజాతులకు మనుష్యధర్మము నాపాదించుటకంటె; వనచర ధర్మమునుబట్టి తార వాలి యనంతరమున సుగ్రీవుని భార్యయై సుఖించినదనుట సమంజసము.

మరియు మానవజాతిలోగూడ మహమ్మదీయులలో నీయాచారమున్నది. అన్న చనిపోతే అన్న భార్యను తమ్ముడు; తమ్ముడు చనిపోయిన వాని భార్య నన్నగారు వివాహమాడుతారు. అది వారి సమ్మతిని బట్టి యుంటుంది. నిర్బంధముకాదు ఇట్లు చేయుటవలన కుటుంబకలహాలు, ఆస్తి పంపకాలకు వ్యాజ్యాలు మొదలైన విరోధాలకు తావుండదు.

కాన దూరదర్శియగు రామచంద్రమూర్తి తారాంగదు లొకటిగానుండి సుగ్రీవుడు వేరైనయెడల యిరువురిలో మరల వైరాగ్ని పుట్టునని యోచించి సుగ్రీవునకు రాజ్యపట్టాభిషేకముచేసి, అంగదుని యువరాజుగానొనర్చి శాంతి భద్రతలస్థాపించినారు.

ఇంతేకాకుండా కోపముతో మండిపడుచున్న లక్ష్మణుడు తార శాంతోక్తులు పలుకని యెడల వానర సమూహమునంతటి నొక్కమారు నిర్మూలనము చేసెడివాడే. అప్పుడు రావణ సంహారరూపమగు దేవకార్యానికే భంగము వాటిల్లవచ్చును. అటువంటి యొడుదుడుకు లేవియు రాకుండ తార యడ్డుకొనినందున రామకార్య నిర్వాహకులలో నీమెనుగూడ నొకతెనుగా జెప్పనొప్పును.

(విజయవాడ ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)

వేదవల్లి తాయారమ్మ

# స్వామినాథన్

మూలం :
శ్రీ ఆర్. కె. నారాయణ్

స్వేచ్ఛానువాదం :
శ్రీ చీమలపాటి సూర్యనారాయణ

[స్వామినాథన్‌కు మణి, శంకర్, శామ్యూల్ ముగ్గురు స్నేహితులు, వీళ్లందరిలోకి మణి చాల పోకిరి. చదువు సంధ్యలు లేకుండా అల్లరిగా తిరుగుతూ ప్రతివాళ్లతోటి గిల్లి కయ్యము పెట్టుకొనేవాడు. అందువలన ప్రతివారికి అతనంటే భయం. రాజం అనే బాలుడు మద్రాసునుండి నూతనంగా వచ్చిచేరాడు. ప్రతిరోజు చక్కగా ముస్తాబై స్కూలుకు వెళ్లుతుండేవాడు. అతనిపై తన డాఖా చూపించాలని మణి రాజంను కదిలించాడుకాని వ్యవహారం ఎదురెక్కింది. అందుకని ఎలాగైనా రాజం తలను తన కర్రగదతో బద్దలుచేసి నదిలో గిరాటువేయాలని ఊహించి కయ్యానికి కాలుదువ్వాడు. ఈ కథాకాండ అంతా స్వామి నాథన్ సహకారంతోనే జరుగుతోంది. అనుకొనిన ప్రకారం కయ్యానికి తయారయారు. కాని మణి రాజం ఏ ఆయుధం లేకుండావస్తేతన కర్ర గదతో తలపడి అతనితల పగులకొట్టలనుకొన్నాడు. కాని రాజం వస్తూ తుపాకి తీసికొనివచ్చి ఒక గుండు గాలిలోకి వదిలేసరికి మణి విస్తుబోయి ఒకరికి తెలియకుండా మరొకరు ఆయుధాలు తెచ్చుకొన్నందుకు పశ్చాత్తపపడి యిద్దరు స్నేహితులయ్యారు. ఆనాటినుండి రాజం యడల స్వామినాథన్‌కు మంచి అభిప్రాయం ఏర్పడింది. అతనిని ఎవరుకించపరచినా సహించేవాడుకాడు. వాళ్ల నాయనమ్మతో అతని గొప్పతనాన్ని ప్రత్యేకతనుగురించి తరచుగా చెప్పుతుండేవాడు. రాజం, మణి, స్వామినాథన్ స్నేహితులుగా మెలగుతూండేవారు—ఇక చదువండి.]

(గతసంచిక తరువాయి)

"యిక్కడ పోలీసు సూపరిన్‌టెండెంటుగారి కుమారుడు రాజంలేడూ, అతడూ, మేము సాక్షాత్తూ స్నేహితులం. మమ్మల్ని తననోమారు యింటిదగ్గర కల్సుకోమని కబురు పంపాడు తెల్సిందా?" అని సంగోరు ధైర్యంతో అన్నాడు!

పోలీసు వీరిరువుర్ని రాజం గదిదగ్గర విడిచిపెట్టి వెళ్లి పోయాడు రాజంగది చూచేందుకెంతో అందంగాను, నీటుగానువుంది. ఆ గదిలో కుర్చీలున్నాయ్; నిజంగా కుర్చీలే! నీటుగా పుస్తకములతో సర్దబడిన ఓటేబులు, దానిమీదో వాచివుంది.

ఆదే సమయంలో రాజం గదిలోకి వచ్చాడు. వీళ్లను చూడగానే, —

"ఎమ్రోయ్, కుర్చోండి, కూర్చోండి!" అని జాగాలు చూపించాడు!

కొద్దీ నిముషముల తరువాత, వారు ముగ్గురూ వివిధ విషయాలు గురించి, తమ వుపాధ్యాయుల గురించి, క్లాసులోని స్నేహితుల గురించి మాట్లాడు కుంటూ, చివరకు వారి సంభాషణ 'ఆటలు' దగ్గరకు వచ్చే సరికి యాగిపోయింది.

"ఎమ్రా, మీలో యెవరికైనా ఆకలిగా వుందా?" అని రాజం ప్రశ్నించాడు. స్వామి, మణి వొకరి ముఖాలు వొకరు చూచుకొన్నారు.- పాపం, వారుభయులూ ఆకలితో నకనకలాడుతున్నారు. చెప్పేందుకు నసుగుతున్నారు. మొహమాటంగా వుంది. వారి పరిస్థితిని ఆ మూలాగ్రంగా కనిబెట్టిన రాజం. —

"ఏయ్! —" అని, బయటున్న ఎవర్నో వుద్దేశించి పిలిచాడు.

ఆ పిలుపు వినంగానే ఓ పోలీసు జవాను లోపలకువచ్చి, సవినయంగా సెల్యూటుచేశాడు!

"పోయి, వంటపుట్టితో ముగ్గురుకు కాఫీ - పలహారం తెమ్మనమని చెప్పు!" అధికార స్వరంవుట్టి పడుతూన్న గొంతుతో అన్నాడు. పోలీసు నిష్క్రమించాడు!

వంటవాడు — పెద్ద పళ్లెంలో ముగ్గురుకు సరిపోయిన కాఫీ - పలహారములతో ప్రవేశించాడు. ఆ పళ్లెమును టేబిలుపై పెట్టాడు. తన యింటిలో పనిచేసే వారిపై తనకెంత అధికారమున్నదీ స్వామికి- మణికి ప్రదర్శింపసాగాడు!

"దాని మీదనుండి ఆ పళ్లాన్ని తీసిపారేయ్!—" అని వంటవాని మీద గర్జించాడు.

ఆ పళ్లాన్ని టేబిలు మీదనుండి తీసి, కుర్చీమీద పెట్టాడు —

"ఓరి చవటగాడిదా, దానిమీద పెట్టకు, తీసేయ్ —" అని వురిమాడు.

"నేనెక్కడ పెట్టేది రాజూ?"

అని వంటవాడు ప్రశ్నించాడు!

"రాస్కెల్, స్కౌండ్రల్, మళ్లీనాతో మాట్లాడ్డం కూడానా?"

వంటవాడు కోపంగా ముఖం పెట్టి. — ఏమిటో నోట్లో గొణుక్కున్నాడు.

"టేబిలు మీద పెట్టు!" అని రాజం చివరకు ఆజ్ఞాపించాడు.

"మీరు అసభ్యంగా ప్రవర్తించినట్లయితే, మీ విషయమై మీ యమ్మగారితో చెప్పవల్సివుంటుంది!"

"వెళ్లి చెప్పు! ఖాతురు చేసే దెవఁడు?" వంటవాడు వొక నిముషం అటుయిటు జూచి; —

"మీకు పలహారమే కావాలంటే, వంటయింటి లోకివచ్చి తినిపోండి." అంటూ, పలహారపు పళ్లెంతో నిష్క్రమించాడు, స్నేహితుల సమక్షంలో తనను పరాభవించిన వంటవానిని నమిలి, మింగి వేయాలన్నంత కోపంవచ్చింది: కానీ సమయం దాటిపోయింది.

రాజంను వంటవాడు యెదిరించి, ధిక్కరించినందుకు వెంటనే తుపాకీతో రాజం వాడ్ని యెందుకు కాల్చి చంపివేయలేదని స్వామి అనుకున్నాడు!

రాజం రెండు నిముషాలు పరాభవింపబడిన ముఖంతో స్నేహితుల దగ్గర నిలుబడి, తరువాత వురిగిపొంగే నవ్వుతో. —

"వెధవ; వాడో హాస్యగాడు (Buffoon) లెండి ...ఒక్క నిముషం ఆగండి...యిప్పుడేవస్తా..." అంటూ నిష్క్రమించాడు.

కొద్దినిముషముల తరువాత రాజం పలహారపు పళ్లెము తను స్వయముగా తీసుకురావటాన్ని చూచిన స్నేహితులిద్దరూ విస్తుపోయారు. రాజం — నిజంగా

వంట వాఁడి దగ్గర వోడిపోవటం, వీరభయులకూ చాలా చిన్నతనమనిపించింది!

"నేనే – స్వయంగా వీట్ని తెచ్చాను. వంట యింటిలో వంటవాణ్ణి వచ్చేట్లు తన్నేశానులెండి! దాంతో వాఁడి పోతరం కుదిరింది!" అని-రాజం చెప్పంగానే, స్నేహితులిద్దరూతృప్తి చెందారు!

## ౨

అది శనివారంనాఁటి మధ్యాహ్నము. —

ఆ మధ్యాహ్నము రాజం, స్వామింటికి వస్తానని చెప్పటంచాత, స్వామెక్కువగా గాబరాపడ సాఁగాఁడు. స్వామి గాభరాపడేందుకు కారణం యేమిటంటే-రాజంవచ్చినట్లయితే యెక్కడ కూర్చోపెట్టాలో అని! తన స్వంత గదికి రాజను తీసుకు వచ్చేందుకిష్టంలేదు; అది మురికి కాల్వకంటే హేయంగావుంది; పుస్తకాలు, గదిలోని స్వామి దుస్తులుగురించి చెప్పనవసరమేలేదు!

స్వామి – తన గదిలోని టేబిల్ను శుభ్రంగా గుడ్డతో శుభ్రపరిచాఁడు: తనతండ్రి యాశ్చర్యపోయేలా, మొల్రతాడు విడిపోయిన తెనక్లాసు పుస్తకాలన్నింట్నీ నీఁటుగసర్దాడు. స్వామికింత శ్రద్ధ వుడుతుందని, స్వామితండ్రి కలలోఁగూఁడా భావించలేదు! తరువాత నాయనమ్మ దగ్గరకు వెళ్లాఁడు!

"నాన్నమ్మా, ఒకమారు 'నీతో రాజం' గురించి మాట్లాడేను జ్ఞాపకముందా? —" అని ప్రశ్నించాఁడు!

"అవును బలంగావుండీ, ఎప్పుడూ పరీక్షల్లో తప్పి పోతూవుంటాడు, వాఁడా నానీ? —" అని ప్రశ్నించింది.

"అబ్బ, వాఁడు కాదు, నువ్వు మాట్లాడేది మణి గురించి —" అన్నాడు చిరాగ్గా!

"అవునవును; యిప్పుఁడు జ్ఞాపకమొచ్చింది! 'కలవగింజో, లేక, బఠానిగింజో' అని మారు పేరుతో పిలుస్తూవుంటూరు ఆకుర్రాడుకదూ?" తెల్సిందెల్సింది!

"మొద్దుమొహం, గరుఁడుసేవాని! ఏమిఁటి తెల్సింది? నువ్వు మాట్లాడేది శామ్యూల్; 'బఠాని గింజ' గురించి! అసలు నేను మాట్లాడేది 'రాజం' గురించి! ఎవరైతే పెద్దపులిని చంపారో, ఎవరి తండ్రి పోలీసు సూపరిన్టెండెంటో — వాఁడిని గురించి మాట్లాడుతున్నాను; యిప్పటికైనా జ్ఞాపకం వచ్చిందా? —"

"ఓ — ఆ కుర్రాడిక్కడకు వస్తూన్నాడా? నాకు చాలా సంతోషంగావుంది. —"

"అవును – కానీ – నీతో ఓ ముఖ్య విషయం చెఁబుదామని వచ్చాను..."

"ఆ కుర్రాణ్ణిక్కడకు తీసుఁకు వస్తావా? వాడ్ని చూడాలని వుంది నానీ –"

"సరే చూద్దాంలే! నేను మాత్రం తీసుఁకువస్తానని రాయిగ్రుద్ది చెప్పలేను...అయితే నీతో ఓ విషయం చెప్పవల్సివుంది.. వాఁడునాతో వున్నప్పుడు మాత్రం నువ్వునన్ను పిల్వటంగాని, నా గదికి రావటంగాని వాడున్నంత సేపూ కాస్త విరమించుకోవాలి; మర్యాదగా వుండదు! నంగిరి వేషాలు మట్టుకు యివాళ్టికి వెయ్యఁబోఁకు! —"

"ఎందుకని?" నాయనమ్మ ప్రశ్నించింది.

"వాస్తవం యేమిటంటే – సరే, నువ్వునాకు బావున్నా, వాఁడి దృష్టిలో మాత్రం ముసిల్దాని మల్లే కనఁబడతావ్; అసహ్యించుకుంటాఁడేమె అని... అంతే...మరేంలేదు! —" అని స్వామి చెప్పిన దానికి నాయనమ్మ అంగీకరించింది!

స్నేహితుఁడికి మంచి ఫలహారము లివ్వాలనే తలంపు కలఁగఁగానే, అప్రయత్నముగా కాళ్లు వంట యింటి వయిపు దారి తీశాయ్. కత్తిపీట ముందరఁ గూర్చుని అరఁటియాకులను తరుఁగుతూన్న తల్లి దగ్గరకు స్వామి వెళ్లాఁడు. తల్లిముందరఁగూర్చుని అరిటాకులను చింపసాగాఁడు.

"అరిటాకులను చింప వాఁడు! మరి తుడవలేను." అని తల్లంది!

"అమ్మా, మధ్యాహ్నమునకు యేపలహారం చేద్దామని యభిప్రాయపడుతున్నావ్ ? —" స్వామి తెలుసుకుందామని ప్రశ్నించాఁడు.

"దాని గురించి ఆలోచించేందుకు చాలా వ్యవధుంది లెద్దూ!" తల్లంది.

"రోజూలావుత్తి కాఫీయే చేసి వూరుకోక మంచి మంచి ఫలహారం (Both Hot and Sweet) చెయ్యాలి - తెల్సిందా? యీ మధ్యాహ్నమే రాజం వస్తున్నాఁడు. మరిచిపోఁకు ఆమాత్రం!"

అని తల్లిని హెచ్చరించాఁడు. అప్రయత్నముగా— రాజం యింటిలో — రాజంకు కావలసినన్ని ఫలహారములన్నీ వంటవాఁడే తెచ్చిపెడతాడన్న విషయం జ్ఞప్తికిరాగానే —

"అమ్మా, మేం కాఫీ పలహారములకిక్కడకు రాకపోతే నువ్వేం అనుకోవుగదా? మా గదికి పంపఁగలవా? ... (వంట పుట్టివయిపు దిరిఁగి —) చూశావా, నువ్వు మురికి ధోవతితో పలహారం పట్టుఁగుని నా గదికిరాకు; చలవఁజేసిన, ధోతీ, చొక్కాను ధరించుకురా; తెల్సిందా? బధ్రం! -" అన్నాడు. కొంత సేపు పోయినతరువాత. —

"అమ్మా, ఒక గంటో, రెండుగంటల సేపో నాన్నగారి గదిని నాకివ్వమని అతనితో చెప్పవ్?" అన్నాఁడు!

"నాకు తీరుఁబడిలేదు, నువ్వేపోయి అడుఁగు!" అంది.....

స్వామి తండ్రి దగ్గరకు వెళ్లి. —

"నాన్నారూ, మిమ్మల్నొకటి అడఁగాలని వచ్చాను!" అన్నాఁడు మనస్సులోని విషయాన్ని మరుఁగు పరుస్తూ.

పేపరు పఠనంలో నిమగ్నులైవున్న స్వామి తండ్రి బుర్ర ప్రక్కకు త్రిప్పారు.

"నాన్నగారూ, మీగది నోమారు నాకిప్పించరూ? —"

"ఎందుకని? -" తండ్రి అడిగారు.

"యివాళ — మన యింటికొక స్నేహితుఁడు వస్తాఁడు!" స్వామన్నాఁడు.

"నీకో స్వంత గదుందిగా!"

"రాజంకది చూపించేందుకు నాకిష్టంలేదు!"

"ఎవరారాజం? అతనో పెద్ద మనిషా? —" తండ్రి ప్రశ్నించారు.

"వాఁడు - పోలీసు సూపరింటెండెంటు కుమారుఁడు. వాఁడు — మనవంటి సామాన్యపు వ్యక్తిఁగాఁడు!"

"అట్టాగా! నీవు నాగదిస్తానుగాని, నా గదిలోని వస్తువులను చిందర వందర చేయవాఁకు!—" తండ్రి స్వామిని హెచ్చరించారు.

"ఓ — చాలా జాగ్రత్తగా వుంటాను. మీరు మంచి నాన్నగారు, నాన్నగారూ!" స్వామి వురికి పొంగే వుత్సాహముతో అన్నాఁడు.

తండ్రి నవ్వుతూ. —

"నీ గదికిపోయి, చదువుకో అబ్బాయ్!" అన్నారు.

## ౬

రాజం విజిట్టుంతా స్వామి భావించిన దానికంటే మనోహరంగా ఐపోయింది. తనతండ్రి — తనకు వాగ్ధత్తంచేసిన ప్రకారము గదిని విడిచిపుచ్చారు. తల్లి — రోజూ కంటే — యివాల్టి ప్రత్యేకఁపు పలహారములను మధురాతి మధురంగ తయారుఁజేసి పంపింది. నిజంగా -కాఫీ యింత రుచ్యంగానుంటుందంటే స్వామి నమ్మలేకపోయాడు. తన నాన్నమ్మ తను యిచ్చిన మాటను నిలుపుకున్నందుకు స్వామి మనస్సులో ఆమె నెంతో వూపిరితిరుగకుండా అభినందించాఁడు. కానీ - యింత యానంద సమయంలోనూ, వంటవాఁడు—తనుఁజెప్పి

నప్పటికి తెల్లటి దుస్తులను ధరించి, తన గదికి రానందుకు విచారించటం తప్పిందికాదు!

రాజంను తన తండ్రి తిరుగుడు కుర్చీలో (Revolving Chair) స్వామి కూర్చుండబెట్టాడు రాజం వచ్చి అప్పుడే మూడు గంటలు కావస్తోంది.

వీరుభయులూ - మణి, రైళ్లగురించి, పులుల వేట గురించి, పోలీసులుగురించి, దెయ్యాలు గురించి, మాట్లాడసాగారు. తరువాత వాళ్ల వుపాధ్యాయులతో వారి సంభాషణ అంతమయింది.

"నీగదేదీ? —" రాజం అప్రయత్నంగా ప్రశ్నించిన దానికి, స్వామి తల్లడిల్లసాగాడు.

"యిదే నాగది, ఎందుకూ?" అని పాలిపోయిన ముఖంతో అన్నాడు!

యీగది యెవరిదా అని తర్జనభర్జనలు చేయటంలో - రాజం కొంతవ్యవధి తీసుకున్నాడు.

"నువ్వటువంటి పుస్తకాలు చదువుతావా?" అంటూ, అందంగా బైండుజేసిన స్వామి తండ్రిలా పుస్తకాలను చూపిస్తూ ప్రశ్నించాడు;

యీ ప్రశ్నతో స్వామి గంగవెర్రులెత్తసాగాడు. గాభరా అధికమయింది. రాజంకు స్వామి పుస్తకాలెక్కడున్నాయో తెలియక. —

"నీ పుస్తకాలేవీ? అని ప్రశ్నించాడు. స్వామి, లేని నవ్వును తెచ్చుకుంటూ. —

"వాస్తవం యేమిటంటే - యీటేబులు మా నాన్నగార్కి సంబంధించినది. నేను బయటకు పోయేటప్పుడు, మానాన్నగారు తమ, వ్యాజ్యెగాండ్రను (Clients) యిక్కడ కల్సుకుంటూవుంటారు—" నగ్న సత్యాన్ని కప్పిబుచ్చే ప్రయత్నములో ముఖంలో ఆందోళన కనబరచసాగాడు.

"అయితే - నీ పుస్తకాలనెక్కడ భద్రపరుస్తూ వుంటావ్?" తిరిగి ప్రశ్నించాడు. అధిక గాబరాను తనకుగలిగిస్తూన్న యీ సంభాషణనుండి రాజంను తప్పించాలన్న యుద్దేశముతో. —

"నువ్వెప్పుడయినా మానాన్నమ్మను చూశావా రాజమ్?" అని ప్రశ్నించాడు.

"లేదు. ఆమెను నాకోతూరి చూపించుతావా? ఆమెను చూడాలని నాకభిలాషగావుంది!" రాజం అన్నాడు.

"ఒక్క నిముషంతాళు" అంటూ, అక్కడనుండి మెల్లిగా దాటుకున్నాడు. నాయనమ్మ దగ్గరకు వెళుతున్నాడేగాని, నిద్ర బోతూవుంటుందని స్వామి నమ్మిక. నిద్రబోతూన్న నాయనమ్మను రాజంకు చూపించేందుకు స్వామికి సుతరాం యిష్టం లేదు.

నాయనమ్మ మాత్రం మంచంమీద కూర్చుంది. ఆమెను చూడగానే పెద్దగ వూపిరి పీల్చసాగాడు.

"ఏమిటబ్బాయ్, ఏమిటి కావాలి? —" అని ప్రశ్నించింది.

"ఏమీ అఖ్లే. నువ్వు నిద్రపోతున్నావా?" యింకా అనుమానం తీరక ప్రశ్నించాడు!

కొద్ది నిముషములతరువాత. —

"నాయనమ్మా. రాజంను దీసుకువచ్చాను నిన్ను చూస్తానంటేను!" అన్నాడు పెద్దగా అరుస్తూ.

"తీసుకువచ్చావా నాయనా? - దగ్గరకు రా నాయనా, రాజం! నీ ముఖాన్ని నిర్దుష్టంగా చూడలేకుండా వున్నాను, ముసిల్దాన్ని ఔటంచాత -" ఎంతో ఆప్యాయంగా రాజంను పిలిచింది.

రాజం - ఆమె మంచంపై కూర్చున్నాడు. స్వామినాయనమ్మ - రాజం తల్లి పేరేమిటో - ఆమెకెందరు పిల్లలలో - ఎన్ని నగలున్నాయో మున్నగు విషయాలన్నీ ప్రశ్నించింది. ఆమె యడిగిన ప్రతీ ప్రశ్నకూ రాజం సమాధానం చెప్పుకుంటూ వచ్చాడు.

తరువాత రాజం ఆమెకు —

మద్రాసు - మద్రాసులోని లైటుహౌసు గురించియు, సముద్రం గురించియు, ట్రాముల గురించియు,

బస్సులగురించియు, సినిమాలు గురించియు వివరించి చెబుతూంటే—నోరు యావలించి వింతగా వినసాగింది.

## ౧౦

స్వామి క్లాసులోకి యడుగు పెట్టంగానే 'గొణగొణ' ధ్వని మాత్రం వినవచ్చింది. తన జాగాలోఁ గూర్చుని—ఆధ్వని తనకు సంబంధించింది కాదను కున్నాఁడు. కానీ—ఆధ్వనింకా చెలరేఁగుతూనే వుంది. మీఁదకుఁ జూశాఁడు:

అప్రయత్నముగా స్వామి దృష్టి నల్లబోర్డుమీదకు ప్రసరించింది. అతని ముఖం కందగడ్డలా మారి పోయింది. ఆ నల్లబోర్డు మీద పెద్దక్షరములతో,—

'తోక!' అని వ్రాయఁబడివుంది.

స్వామి—బోర్డు దగ్గరకు వెళ్లి చేతితో దానిని చెరిపివేశాఁడు. పుస్తకాన్ని చదవటంలో దీక్ష వహించిన శంకర్ వయిఁపు, 'బఠానీగింజ' వైఁపు తీక్షణంగాఁ జూశాఁడు! మాట్లాడకుండా స్వామి—'బఠానిగింజ' దగ్గరకు వెళ్లి,-బుగ్గ కందేలా వొక్క లెంపకాయ కొట్టాఁడు. 'బఠానిగింజ' యేడుస్తూ, తనకేగొడవా తెలీదని, తను రాయలేదని చెప్ప సాగాడు. శంకర్ రాశాఁడేమో అనుకుని, శంకర్ను కొట్టాఁడు.

దీనితో వారి ముఫ్వురిలో యుద్ధ జ్వాలలు చెలరేగాయ్. ఒకరిమీఁదొకరు పడి దొర్లుకుంటూ, కొట్టుఁకుంటున్నారు.

ఇంతలో—బడి గంటకొట్టారు—

రాజం, సోమూ, మణి, క్లాసులోకి వచ్చారు. టీచరుకూడా క్లాసులోకి వచ్చి వీర్ని జూచి, విస్తుఁబోయారు!

సోము, మణి వార్ని విడదీశారు. వుపాధ్యాయుఁడు తన జాగాలోఁగూర్చున్నారు. సోములేచి నిలుఁబడి.—

"అయ్యా, మేము బయటకు పోతాము; క్లాసును డిస్టర్బ్ చేయటం మాకిష్టంలేదు. అనుమతి వ్వాలి!" అన్నాడు

స్వామిని, మణి, బయటకు గెంటుతూ, అందరూ గ్రౌండులోకి దారితీశారు.

"ఏమ్రా దొమ్మరి వెధవల్లారా, కొట్టుగుంటు న్నారు?" మణి ప్రశ్నించాఁడు!

ఆ ముగ్గురూ ఒక్కమారే మాట్లాడసాగేరు: అందరి గొంతుకులకంటే స్వామిగొంతే పెద్దగా వినఁబడు తూంది:

"వాఁడు — ఆ'బఠానిగింజ' వెధవ — 'తోఁక'ని వ్రాశాఁడు—పెద్దతోఁక—నల్లబల్లమీఁద—పెద్ద—" అని ఆయాసంగా చెప్పసాగాఁడు.

"నేను రాయలేదు; దొంగవె -" అని 'బఠాణి గింజ' వురిమాఁడు.

"అయితే—శంకర్ వ్రాశాఁడు"

"దొంగవెధవా, నువ్వు చూశావురా?" శంకర్ వొక్కమారు బొబ్బరించాడు

మణి వాళ్ల నోర్లను మూసివేశాఁడు.

"ఏదెట్లున్నా, తోకేమిట్రా?" అని తెలియక పోవటంచాత ప్రశ్నించాఁడు!

"వాళ్లునన్ను—'రాజంతోకా' అని పిలుస్తు న్నారు" అన్నాఁడు.

"ఏమిటీ!... యిక్కడ రాజంగురించి మాట్లాడేందు కెవరికి గుండెలున్నాయ్?" అన్నాఁడు మణి.

"హుఁ! - గుండెలా?" సోమన్నాడు.

"ఎవ్రరా వెధవల్లారా. మీలో ఎవరైనా వ్రాశారా? నిజం చెప్పండి!" మణి కోపంగా ప్రశ్నించాఁడు.

(సశేషము)

# పెళ్ళిప్రయాణం

సోమయాజులు యెస్టేటులో ఒక చిన్న వుద్యోగి. రమారమి పన్నెండు సంవత్సరాలు అవుతుంది విజయనగరంలో కాపురం పెట్టి. యీ రోజులలో వందలకు వందలు జీతాలు తెస్తూవున్న వారికే కుటుంబ పోషణం యెంతో కష్టంగా వుంటుంది. అటువంటిది యెస్టేటులో చిన్న వుద్యోగం చేస్తూ నెలకు యాభైరూపాయిల జీతం తెచ్చే సోమయాజులుకి కుటుంబపోషణ కష్టంగా వుందనడంలో ఆశ్చర్యమేముంది? తను, భార్యా, ముగ్గురు ఆడపిల్లలు యిదే అతని కుటుంబం. చూచినవాళ్లకి చిన్నదిగానే వుంటుంది. కాని వాళ్లని పోషించుకుని వచ్చేసరికి తాతలు దిగివస్తారు. గొడ్డాలికి యేమితెలుసు బిడ్డల పెంపకం అని యేకాకిగా తిరిగేసి వూరుమీద బ్రతికే వాళ్ళకి కుటుంబభారం యేం తెలుస్తుంది! పాపం! సోమయాజులు యేంచేస్తాడు! ఆఫీసు వదిలేక సాయంత్రంపూట పదిమంది గుంటలనిచేరదీసి ప్రయివేట్లు చెప్పుకుంటూ మరో ముప్పయ్యో నలభయ్యో సంపాదించుకుని ఆ కుటుంబాన్ని యీదుకు వస్తున్నాడు. భార్యా చంద్రమ్మ చూడబోతే వుత్తిచాదస్తపు మనిషి. రెండువందలయాభై సంవత్సరాల క్రిందట వుండవలసిందిగాని, ప్రస్తుత నవనాగరికత ప్రపంచంలో పుట్టవలసిన మనిషిగాదు. అయితే అటువంటి మహా పతివ్రతలు యేకొద్దిమందో యింకా భూమిమీద వుండబట్టే మనభారతదేశం యెన్ని కష్టాలపాలైన కూడుగుడ్డలకి లోటులేకుండా వుందని కొందరు వేదాంతులు అంటారు. అదెలాగవున్నా, ఆవిడచాదస్తమో, ఆ బ్రాహ్మడి దౌర్భాగ్యమోగాని తాతలు నాటి పద్ధతులు అన్నీ ఆవిడని వేధించుకు తింటున్నాయి. ఆమెను బాధిస్తున్న సమస్యలలో ముఖ్యమైనది పిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యలేదని.

ఆ రోజు ఆదివారం శలవు అవటంచేత కాస్త వేగిరంగానే యింటికి వచ్చేసాడు సోమయాజులు.

"యేమండీ! వారంకి ఒక్క రోజుకదా మనం తీరుబాటుగా మాట్లాడుకోవడం. తక్కిన ఆరురోజులు మీకు నాతో ఒక్కసారి అయినా ముచ్చటించడానికి తీరుబాటు వుండదాయె. యే ఆఫీసో, యేంవుద్యోగాలోను!" అంది చిన్నగా నవ్వుతూ చంద్రమ్మ.

"అవును చంద్రా! యెలాగ చెప్పు? యింతరాత్రి పగలూ కష్టపడ్డా ఆ కూలి

డబ్బులయినా కిట్టుబాటు కావడంలేదు. నెలఅయేసరికి పిల్లలకి బడిజీతాలు కట్టాలా! యింట్లో ఖర్చులు మామూలే. డబ్బు లేదని నోరు కట్టుకోగలమా! యేఖర్చు మానేగలం! యీ రోజుల్లో నెలకి ఒక శతకమేనా సంపాదించలేకపోతే కుటుంబాన్ని పోషించడం మాహాకష్టం" అన్నాడు వాలు కుర్చీలో చేరబడుతూ యాజులు.

"ఇదుగో చూడండి! ఆడపిల్లలకి చదువులెందుకు చెప్పండి? యేదో చాకలిపద్దు రాసుకోవడానికి నాలుగు అక్షరంముక్కలు చెప్పించేరు సరిపోయె. యింట్లో యెక్కడ లేని డబ్బూ మనతిండికే చాలకుండావుంటే వాళ్ళకి చదువులుకూడా యెందుకు. ఆడపిల్ల యెప్పుడేనా అత్తవారింటికి పోవలసిందేకదా! యీ ఇంగ్లీషు చదువులు చదువుకొని వుద్యోగాలు చెయ్యాలా? వూళ్ళు యేలాలా? పెద్దపిల్ల స్కూల్ ఫైనల్ ప్యాసు అయిందికదా! యింక నా మాటవిని ఆ కాలేజీ చదువులు మాన్పించేయండి"

"అబ్బబ్బా! అదేమిటే అలాగ అంటావు? పిల్ల చదువుకుంటూవుంటే మాన్పించమంటావేమిటే! మనకి మొగపిల్లలులేరు. కూతురైనా కొడుకైనా అదేకదా! బి. ఎ. ప్యాసు అయిందంటే అదే యేదైనా వుద్యోగంచేసి మనల్ని పోషిస్తుంది. నేను యింక రెండు సంవత్సరాలలో రిటయిరీ అయిపోతున్నాను. మనకి వేరేదిక్కు యేమిటుంది చెప్పు చంద్రా!"

"అయ్యో అయ్యో! నాకర్మంకాలా! ఆడగుంట వుద్యోగం చెయ్యడం మనల్ని పోషించడమునా! గట్టిగా అనకండి యెవరైనావింటే నవ్వుతారు. యిప్పటికే నలుగురూ ఛీ అంటున్నారు. రెండు సంవత్సరాలు అయింది పిల్ల పెద్దమనిషిఅయి. రెండోపిల్లకూడా రేపోమాపో పెద్దమనిషి



నవయుగ వారి "జ్యోతి"లో సావిత్రి

కావడానికి సిద్ధంగావుంది. యింకా పెళ్ళిళ్ళు చెయ్యకపోతే నలుగురూ ఆడిపొయ్యారండి! యిప్పటికే చూసిన వాళ్ళంతా, యెప్పుడే చంద్రమ్మ! మీ పిల్లకి పెళ్ళి ? మాకు బూరెముక్క యెప్పుడు పెడతావో! అంటూ నన్ను యెత్తిపొడుపు మాటలలో పొడుచుకుతింటున్నారు. అదేం చదువులో యేమిటో! పిల్లవాటంచూస్తే నాకేం బోధపడ్డంలేదు. రాత్రిపగలూ చదువుకోవడానికని క్లాసుపిల్ల లింటికి వెళ్ళిపోతూ వుంటుంది. యింట్లో నామాట బొత్తిగా వినడం మానేసిందికదా! మనవీధిలో పశువుల డాక్టరు ఒకడు దిగేడుకదా క్రొత్తగా. వాళ్ళ అమ్మాయిలుకూడా తన క్లాసే చదువుతున్నారట. ఇరవైనాలుగు గంటలూ వాళ్ళతోటే తిరుగుతూ వుంటుంది. మా చిన్నప్పుడు మేంకూడా చదువుకున్నాముకాని యిలాంటి రావిబాటు యెరక్కపోయాం. మొన్న వెంకమ్మ అత్త కోళాయి దగ్గర అంది యంటే, వూరికేనే అనలేదు. మన అనువుకనిబెట్టే నాలుగు మాటలు ఆడిపోయింది. 'ఆ డాక్టరు మంచివాడు కాడుట. మన అమ్మాయి వాళ్ళ యింటికి వెళ్తే యెంతో అభిమానం వున్నట్టుగా నటిస్తూ యెత్తేసుకుని ఒళ్లో కూర్చోబెట్టుకుని ముద్దులు పెట్టేసుకుంటున్నాడు. నేను కళ్ళార చూచేను అని చెప్పింది వెంకమ్మ. పెద్దమనిషికదా వాడికేం పోయేకాలం చెప్పండి? మళ్ళీ డాక్టరుట, ముండా డాక్టరు. యింతకీ మన అమ్మాయికి బుద్ధి వుండక్కర్లే. వాళ్ళ గుమ్మంలోకి యెన్నిసార్లు వెళ్లవద్దన్నా యెప్పుడూ అక్కడే పడిచస్తుంది. ఇదంతా మీనుంచే వచ్చింది. మీరే దానికి కొమ్ములు తీసుకొని వచ్చేరు. యికనైనా కళ్లు తెరుచుకొని పిల్లకి పెళ్ళి చెయ్యండి.'

'నీతో గట్టిచిక్కు వచ్చిందే అడివి మొద్దా! యిప్పటికిప్పుడు పెళ్లి యెలాగ అయిపోతుందో నువ్వేచెప్పు చంద్రా! పెళ్లి అంటే యెంతడబ్బు వుండాలి! ఆ



రోహిణి వారి ''ప్రతిజ్ఞ''లో సావిత్రి

డబ్బులేకనే కదా పిల్లల్ని చదువులో పెట్టింది. ఇంతకీ మనపిల్లకి పెళ్ళిచేసుకోడం యిష్టంవుందోలేదో! దాన్ని ఒకసారి అడిగిచూచావా"

"అయ్యో .నాయిల్లు బంగారంగాను! దాన్ని అడగడం యేమిటండీ! పెళ్లి అంటే యెవరికి అక్కర్లేదు. చస్తూవున్న ముసలాడుకూడా పెళ్లిచేసుకుంటావా తాతా అంటే పిల్ల బాగుంటుందా అబ్బీ! అంటాడు కదా! నిక్షేపంలాంటి పిల్ల పెళ్లిచేసుకోక పోవడం యేమిటండీ! మీ మొగాళ్ళకి యేమీ తెలీదు! పాపం దాని మనస్సులో యెంత బాధవుందో! యిదుగో చూడండి! విశాఖపట్నంలోను మంచి సంబంధంవుందిట. మొన్న మాఅమ్మ వుత్తరంలో రాసింది. పేరీవెంకన్న పంతులు కొడుకట, సుబ్బారావు; హార్బరులో పని చేస్తున్నాడు. నూరురూపాయిలు జీతం తెస్తున్నాడుట. కట్నాలు, కానుకలు యేమీఅక్కర్లేదు. పిల్ల అందంగావుండి చదువుకున్నదైతేచాలు. ఒకసారి మీరు వెళ్లి భోగట్టాచెయ్యండి అని వ్రాసింది రేపు ఏకాదశి సోమవారం చాలా మంచి రోజు. మీరు ఒకసారి విశాఖపట్నం వెళ్లి ఆసంబంధం యేదో చూసుకురండి! రేపు ఓపూట ఆఫీసుకి శెలవు పెట్టండి. కార్యాలు కథలు అంటే ఆఫీసుక్కి శెలవు యివ్వరా యేమిటి?"

"అబ్బా! గట్టిచిక్కు వచ్చిందే నీతోటి! నువ్వు అన్నట్టూ అయిపోవాలి. సరే రేపు పొద్దంట బండికి వెళ్తున్నాను. నా సంచీలో రెండు చొక్కాలు, రెండు పంచెలు కుక్కు."

◆ ◆ ◆

"చంద్రమ్మక్కా! చంద్రమ్మక్కా! తియ్యవే!"

"యెవరదీ!"

"నేనే! బుచ్చన్నని."

"ఆ! ఆ! వస్తున్నా అన్నాయ్యా! ..."

చేతులోని అన్నపు గిన్నె తిన్నెమీద పెట్టి గబగబావచ్చి తలుపు తీసింది చంద్రమ్మ.

"యెక్కడినుంచి రావడం బుచ్చి అన్నయ్యా!"

"ఆ! .... యీ వూళ్లో యివ్వాళ కోర్టు పనివుంటేను బరంపురంనుంచి వస్తున్నాను."

"నీతో ఒక ముఖ్య విషయం చెప్పాలి చంద్రమ్మా! నీ మొగుడు నీతోటి తప్పకుండా చెప్పమన్నాడు."

"యేమిటన్నయ్యా అది త్వరగా చెప్పు!"

"మరేమీలేదు. నిన్నను నువ్వు నీ భర్త తగువులాడుకున్నారుటగా! యీ కరువురోజుల్లో కుటుంబాన్నే పోషించడం

మహాకష్టంగావుంటే పిల్లలకి పెళ్లిళ్లుకూడా యెక్కడ చెయ్యగలడు. యింట్లో నీ బాధ పడలేక ఆర్థిక చిక్కులతో అలమటిస్తూ మనస్తాపంతోటి కాశీకిపోయినాడు. కొన్ని రోజులపాటు తీర్థయాత్రలు చేసివస్తే కాస్త మనస్సు స్తిమితంగా వుంటుందేమోనని. నిన్ను మరేమీ బెంగపెట్టుకోవద్దు, కొన్ని రోజులు పుణ్యక్షేత్రాలు తిరిగి మళ్ళా వస్తాను అని చెప్పమన్నాడు, అంతే. నేను కోర్టుకుపోయి వస్తాను" అని చెప్పి చల్లగా జారుకున్నాడు బుచ్చన్న.

"ఒసే! లలితా! లలితా! యెక్కడ వున్నావే!"

"వస్తున్నా అమ్మా! ... యెందుకూ!"

"మీనాన్న కాశీపోయినాడు టే! కాశీలో యేముందే నాపిండం! మనందర్ని యే గంగలో కలిసిపోమన్నారో! చావుకబురు చల్లగా చెప్పిపోయేడు బుచ్చన్న. యిప్పుడు యేంచేస్తామే లలితా!"

"అమ్మా! యిప్పుడు నువ్వేమీ విచారించకు. నాన్న మొదట నీతోచెప్తే విన్నావా! యెప్పటికైనా అదేమనకి దిక్కు, దాన్ని చదువుకోనీ, అని లక్షసార్లు నెత్తి మొత్తుకొని చెప్పేరు. మొగాడిని యింట్లో కాల్చుకు తినేస్తే, యెంతకని భరించగలడు! నీ బాధపడలేక యెక్కడికో పోయేరు, మరేమీ ఫరవాలేదులే. యీవూర్లో కొత్తగా సర్వే ఆఫీసు పెట్టేరుకదూ! అందులో అందరికీ వుద్యోగాలు యిస్తున్నారుట. నేనుకూడా అక్కడికిపోయి ఓ చిన్న వుద్యోగం యిమ్మని అడుగుతాను. నువ్వేమీ బెంగపెట్టుకోకు."

"అలాగేనే నాతల్లీ! నువ్వే యింక యిల్లు నిలబడపెట్టాలి."

ఎన్. కామేశ్వరరావు

---

(240 పేజీ తరువాయి)

తాడు. దేశింగురాజూ అంతే! బాలచంద్రుడూ అంతే! చివరికి వీరశైవ మతకర్తయైన బసవేశ్వరుడు ఎనిమిదేళ్ళకే అన్ని విద్యలూ నేర్చేశాడుట!

పసితనంలో చిన్నమ్మ మహా భక్తురాలు. ప్రహ్లాదుడు అట్లేకదా! దేశింగురాజు అయిదేళ్ళప్పుడే బారాహజారి అనే అద్భుతమైన దేవతల గుర్రాన్ని ఎక్కి లొంగదీసేడు. పసితనంలోనె సన్యాసమ్మ యోగవిద్యలు నేర్చింది.

వీరంతా బాల్యంలోనే ప్రసిద్ధులయేరు. కాబట్టి కొందరు బాలరాజులయేరు. ఈ నాయకుల పేర్లలో ఈ 'బాల' ఒకటివస్తూంటుంది; బాలవద్దిరాజు, బాలరాజు, బాలనాగమ్మ, బాలసన్యాసమ్మ, బాలచంద్రుడు, ఇట్లే పలువురు. ప్రాచీనకావ్యాలలో ఇదొక సంప్రదాయం. తమిళ భాషాలో ప్రాచీన గ్రంథాలైన మణిమేఖలై, సిలప్పదిగారంలోకూడ ఇంతే! ఒక ప్రధాన పాత్ర అయిదోయేడు మొదలుగా పన్నెండోఏటికి అన్ని విద్యలూ నేర్చుకొంటుంది. ప్రాచీన జపాను, గ్రీకులగ్రంథాలలో కూడా ఇట్లే కనబడుతూంది. అల్గ్జాండరు విషయమంతే!

గాంధారి కథలోను, కుమారరాముని కథలోను కూడ వీరులు సకల విద్యలును పన్నెండేళ్ళు నిండేటప్పటికే నేర్చుకొంటారు. ఆ విద్యలో ఉండే విషయమంతాకూడ ఏతాదివారీగా కవి వర్ణించేడు.

## దేవతలతో పరిచయం

పరమాద్భుత పాత్రయైన కథానాయకుడు దేవతలతో మాట్లాడడం సర్వసామాన్యం. చెరాబండిరాజును దేవతలే పెంచేరు. అతను వీరభద్రస్వామితో మాట్లాడుతూంటాడు.

నల్లతంగాల్ మహిమకలదికాబట్టి తనమెడలోని మాంగల్యంతీసి కిందపెట్టి 'అదిరాయి అయిపోవాలి' అనగా అది రాయి అయిపోయింది. ఆమె చనిపోయి, దహనం చెయ్యబడ్డ తర్వాత దేవతలువచ్చి బ్రతికిస్తారు. చిన్నమ్మ మహాభక్తురాలు కాబట్టి మెదటి నుంచి దేవతలతో సంభాషిస్తూనే ఉంటుంది. బంగారు తిమ్మరాజు దేవతలతో మాట్లాడతారు. అతనివెంట దేవతలువచ్చి పనులు చేస్తారు. బాలవద్దిరాజు చాల ఘనుడు. మాయల ఫకీరు నియోగించిన శక్తిని ఆ రాజు తెలుసుకొని లొంగతీస్తాడు. దేశింగురాజు శ్రీరంగనాథునితో అవసరమైనప్పుడెల్లా మాట్లాడుతూనే ఉంటాడు. కామమ్మ, సన్యాసమ్మ దేవతలలాగే అన్ని మహిమలు చూపిస్తారు. ఏదైనా ఈ కల్పన బాలనాగమ్మ కథలో కొంత తక్కువ. బొబ్బిలిరాజు కథలో ఇంచుమించుగా లేదనే చెప్పవచ్చు. మల్లమ్మదేవి మాత్రమే గోపాలస్వామిని చూడగలిగింది.

## దక్షిణ నాయకుడు

సాధారణంగా పాతజంగం కథలలో కథానాయకుడు అనేకమంది స్త్రీలను, కులగోత్రాల బాధ లేకుండా వివాహం చేసుకొంటాడు. అప్పటి రాజులలాగే నాయకులుకూడ. కాంభోజరాజుకథలో చెరబండిరాజు ముగ్గుర స్త్రీలను వివాహమాడేడు. అట్లే బాలవద్దిరాజును. కాని ఈ సంప్రదాయం ఇటీవలి చారిత్రక కథలలో కనబడదు. బంగారుతిమ్మరాజు, దేశింగురాజు, పెద్దబొబ్బిలిరాజు పాత మార్గాన్ని అనుసరించలేదు.

## త్రిమూర్తులు మొదలైన దేవతలు

పాత కాలపు కథలలో త్రిమూర్తులు ప్రధానులు. దేవతలు ముక్కోటిమంది ఉన్నప్పటికి పైముగ్గురే జట్టుగా బయలుదేరతారు. మళ్ళీ వారిలో పార్వతీ పరమేశ్వరులు మరీ ముఖ్యులు. కాంభోజరాజు ఉత్సవాన్ని త్రిమూర్తులు చూడవస్తారు. వారిలో పార్వతి ముఖ్యపాత్ర వహిస్తుంది. కాంభోజరాజు భార్యలు ఆత్మహత్యకి సిద్ధపడుతూండగా త్రిమూర్తులు వస్తారు. వారిలో పార్వతి ఆరాణుల ఆత్మహత్యప్రయత్నాన్ని అడ్డగిస్తుంది.

నల్లతంగాళ్ కథలో పార్వతీ పరమేశ్వరులు ప్రధానులు.

కాంభోజరాజు కథలో రామలింగస్వామి రాణులకు సంతానాన్ని ప్రసాదిస్తాడు. చెరాబందిరాజుకి వీరభద్రస్వామి సాయం చేస్తాడు. బాలనాగమ్మ కథలో మాణిక్యదేవి అడివిలో తిరుగుతూండగా త్రిమూర్తులు బ్రాహ్మణ వేషధారులై వచ్చి ఆమెకు నాగమునీంద్రుని పుట్టకి దారి చూపిస్తారు.

ఇతర జంగం కథలలో త్రిమూర్తులు గాక కొన్ని దేవతలు ప్రధాన పాత్రలు వహిస్తారు. చిన్నమ్మకు తుద్దిలేటి స్వామి, ఇతర దేవతలు సాయపడతారు. బంగారు తిమ్మరాజుకి తిరుపతి వెంకటేశ్వరుడు, కంచివరదరాజుస్వామి ముఖ్యులు. కుమారరాముడికి శ్రీరాములవారి సహాయముంది. బాలవద్దిరాజు అనేక అద్భుత శక్తులు కలవాడు. బాలనాగమ్మకి చనిపోయిన ఆమె తల్లే చాల సాయపడుతుంది. కామమ్మ. బాల సన్యాసమ్మ యోగశక్తులుగలవారు.

## సముద్రయానం

ప్రాచీన కథలలో ఏడు సముద్రాలు దాటడమొకటి సాధారణంగా ఉంటుంది. కాంభోజరాజు కథలో చెరాబందిరాజు కీలుగుర్రంమీద సముద్రాలను దాటతాడు. బాలనాగమ్మ కథలో బాలవద్దిరాజు పక్షుల సాయంతో సముద్రాలను దాటేడు. ఇటీవల కథలలో ఈ సముద్రయానంలో ఒకమార్పు కనబడుతూంది. సన్యాసమ్మ భర్త చెంచయ్య, కామమ్మ భర్త మారయ్యకూడ ఉద్యోగంకోసం సముద్రయానం చేస్తారు. పెద్దబొబ్బిలిరాజుకథలో సముద్ర ప్రశంస మాత్రమే ఉంది, బేరిశెట్లు వ రకం నిమిత్తం ఓడలమీద వెళ్ళేరు.

ప్రాచీన కాలంలో సముద్రయానం రెండు మార్గాలుగా జరిగేది. క్రీస్తుపూర్వం ఏడో శతాబ్దానికే హిందూ దేశపు పడమటి తీరానికి బేబిలన్ దేశానికి వర్తకవ్యాపారాలుండేవి. (Buddhist India by Rhys Davids, పుట 72)

క్రీస్తుపూర్వపు బౌద్ధగ్రంథాలైన నికయాలలో తూర్పువైపు సముద్రయానం గురించి పేర్కొనబడ్డది. ప్రజలు సముద్రయానం చేసేవారు. కళింగ దేసంవైపు అడవులుండేవి. అక్కడ సముద్ర తీరంలో ప్రజలు వలసలేర్పరుచుకొన్నారు. ఆ ప్రాంతానికి దంతిపురం రాజధాని Buddhist India by Rhys Davids) పుట 31) ఈ దంతిపురం ఫలానా అని చరిత్రకారు లింతవరకు పోల్చుకోలేదు.

(సశేషము)

# మరపురాని వ్యక్తులు

సి. సి. పున్నయ్య

ఇరువురూ సంఘంలో అత్యుత్తమ స్థానము నలంకరించి బంధుమిత్రుల ఆదరాభిమానములకు విశేషముగా పాత్రులైనారు. ఒకరు సంపన్నులు, మరొకరు నిరుపేద. వారే శ్రీయుత చివుకుల శ్రీరామశర్మ, జయంతి బ్రహ్మానందగారలు.

శ్రీరామశర్మగారు సంపన్నులయినా నిరాడంబరజీవి. ఆయనను పిసినిగొట్టు అని అనేవారు లేకపోలేదు. కాని నిజంగా అవసరానవసరములను గుర్తించి ఖర్చుపెట్టే విషయంలో ఆయన కడునేర్పరి అని మాత్రమే నాయభిప్రాయం. ఉన్నదికదా యని దుబారాగా ఖర్చుపెట్టి ఆడంబరంగాను, విలాసంగాను జీవితం గడుపడం ఏ వ్యక్తియొక్క ఉదార స్వభావాని వ్యక్తం చెయ్యనేరదు.

వారి ఆధ్యాత్మికచింత, విద్యావ్యాప్తి యందలి ఆసక్తి, ఉదార స్వభావములకు నిదర్శనంగా ఒంగోలులోనివారి దేవాలయము, పఠనమందిరముల నిర్మాణము, అమ్మనబ్రోలులో ఉన్నత పాఠశాల స్థాపన సందర్భమున భూరివిరాళము, ఒంగోలులో కళాశాల స్థాపన సందర్భమునయిచ్చిన భూరి విరాళములు, నాగులుప్పలపాడులో గ్రంథాలయ స్థాపనకుచేసిన సహాయములు పేర్కొనతగినవి.

బంధుప్రియులు. వారి ఆదర సత్కారములకు పాత్రులైన వారెవరూ వారి విశాలభావాలు, ఉదార హృదయాన్ని మరువలేరు.

అయితే తన బిడ్డలు సయితం దుబారాగా ఖర్చుపెట్టడం సహించేవాడుకాడు. అందుచేతనే దగ్గర బంధువులు సయితము వారి అభిప్రాయములతో ఏకీభవించేవారు కారు.

ఆయన తాను పండితుడనని చెప్పుకోక పోయినా అన్నివిషయాలలోను, శాస్త్రములలోను పరిచయంకలవాడు. వారి సలహాలు, సూచనలు అభ్యుదయమును అన్వేషించే ప్రతియువకునకు మార్గదర్శకములుగా నుండేవి. వారి ఎదుట నిలువబడి నమస్కరిస్తే ఆశీర్వదించే వారి చిరునవ్వుకు యీనాడు కరువు ఏర్పడడం చాల విచారకరం.

అయితే ఆయనకు ఏకొరతలేదు. భార్య, బిడ్డలు, మనుమలు, మనుమరాళ్లు, బంధుమిత్రుల సమక్షంలో ప్రశాంతమైన వాతావరణంలో అనంత విశ్వంలో లీనమైపోయాడు. దీర్ఘకాలంనుండి అనారోగ్యంతో బాధపడుతూయుండి శాశ్వతశాంతి సౌఖ్యాలను పొందిన శ్రీరామశర్మగారు ధన్యులు. వారి నిర్యాణం తాత్కాలికంగా బంధు

మిత్రులకు మితిలేని విచారం కలిగించిన మాట వాస్తవమేకాని ఆయన మాత్రం అమర సౌఖ్యాన్ని అనుభవిస్తున్నాడన్న మాట యదార్థం.

మరొకరు శ్రీ జయంతి బ్రహ్మానందగారు. వీరు అనేక పత్రికల సంపాదక వర్గాలలో పనిచేశారు. కొంతకాలం 'గృహలక్ష్మి' పత్రికకు సంపాదకత్వము నిర్వహించారు.

వీరు స్వార్థరహితమయిన సేవను దృష్టిలో నుంచుకొని జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమంలోను, స్వాతంత్ర్య సమరం లోను నిర్వహించినపాత్ర మహోత్కృష్ట మైనది. సంఘసంస్కరణలను గురించి ఉపన్యాసములిచ్చి తృప్తిపడిన వ్యక్తికాదు. విప్లవాత్మకమయిన సంఘసంస్కరణలకు అచంచలమైన దీక్షతో కృషిచేసి అందు లోనే తనూ ఒక భాగంగా లీనమైపోయిన వాడు. అంతేకాదు - తత్వవేత్త. వారి తండ్రి శ్రీ నారాయణగారిని మరపిస్తున్నా డేమోననిపిస్తూ బ్రహ్మసమాజంలో పనిచేసి నట్టివాడు.

శ్రీ బ్రహ్మానంద బహుగ్రంథపాఠి. ఏవిష యాన్ని గురించైనా విమర్శనా పూర్వ కంగా సమీక్ష చేయగలిగిన జ్ఞానగని. సుప్రసిద్ధ పత్రికారచయిత; ముద్రణాపరి శ్రమలో అపార అనుభవంగలవాడైనా ఆర్థికదుస్థితి మూలంగా ఆయన శక్తి సామ ర్థ్యాలు రాణింపుకురాలేదు.

ఆయన రెండు చేతులతో సంపాయించే రోజులలో బంధువులకొరకు, స్నేహితుల కొరకు విశేషంగా ఖర్చుపెట్టడానికి వెను కంజవెయ్యలేదు. ఆయన నిరుద్యోగియై నిస్సహాయస్థితిలో నున్నపుడు ఆయన యిత రుల సహాయాన్ని అర్థించడంలో వెనుకంజ వెయ్యలేదు. సహాయము పొందేటప్పుడు చూపిన ఉల్లాసము, సహాయము చేయవలసి వచ్చినప్పుడు చూపకుండా మొగాలు తప్పించి తిరుగుతూయున్న, తిరిగిన బంధు వులు, స్నేహితులు అనేకమంది యున్నారు. అది మానవ ప్రవృత్తియని మాత్రమే అను కొని తృప్తిపడేవాడు బ్రహ్మానంద. అయినా ఆయనగుండె నిబ్బరం అమోఘమయింది కాబట్టి నిస్పృహ, నిరాశల చెందకుండా మద్రాసు నగరంలో భార్య, బిడ్డలతో జీవ యాత్ర గడిపాడు. ఆయన భార్య ఎల్ల ప్పుడు ఆయనను ఉత్సాహపరుస్తూ భర్త మనస్సు పీలై ఎంతవరకు నొవ్వకుండా సహక రిస్తూ తోడునీడై యుండటం పేర్కొన తగింది.

శ్రీ బ్రహ్మానంద చనిపోయేనాటి పరిస్థితులను తలచుకుంటే కడుపు తరుక్కొనిపోతుంది. చికిత్స నిమిత్తమై వైద్యశాలలో చేరితే చేతిలో కానీ లేకపోగా గుపెడు పిల్లలు, భార్య చుట్టూ అల్లాడుతుండగా తనబాధ నిడివేర్చుకొని శాశ్వతంగా కళ్లు మూశాడు శ్రీ బ్రహ్మానంద.

పుణ్యపురుషుడు అనంత విశ్వంలో లీనమైపోయాడు. పైలోకంలో ఆయనకు శాంతి సౌఖ్యాలకు కొరతయుండదు. కాని వెనుక మిగిలిపోయిన భార్యాబిడ్డలు అనాథలుగా నిలబడిపోయినారు. వారితో పరిచయమున్న బంధువులు, స్నేహితులు, జాతీయ సమరయోధులు, పత్రికా రచయితలు వారి కుటుంబానికి యథోధికంగా సహాయం చెయ్యవలసిన బాధ్యత వారిపైనున్నది.

# సభలు, సమావేశములు



## కొవ్వూరు మహిళా వార్షికోత్సవము

16-4-53 తేదీ గురువారము సాయంకాలము 5 గంటలకు మహిళా సమాజము (త్రివిక్రమభవనము) నందుపై వార్షికోత్సవము "ఉభయభాషాప్రవీణ" "విద్వత్కవయిత్రి" శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారి యాధిపత్యమున జరుపబడినది. ఉభయ భాషాప్రవీణ శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు సభా ప్రారంభము చేసిరి. సభకు పురస్త్రీలు పెక్కురు విచ్చేసిరి, తణుకు బాలసరస్వతీ సమాజాధ్యక్షురాలు దేవులపల్లి సత్యవతమ్మగారు, సుభద్రమ్మగారలు మున్నగు నితరగ్రామవాసులుకూడా వచ్చిసభను జయ ప్రదముగావించిరి. సంస్కృత భాషావశ్యకత, ఆంధ్ర సంస్కృతిని గురించి యధ్యక్షురాలు విపులముగాను పన్యసించిరి. మహిళాసమాజములు, స్త్రీల కర్తవ్యము, సత్యమగు దేశసేవను గురించి సత్యవతమ్మగారు, బాలికల విద్యాభివృద్ధిని గురించి పాఠశాల యుపాధ్యాయిని "భాషాప్రవీణ" ఎ. వి. వెంకట సుబ్బమ్మగారు నుపన్యసించిరి.

కార్యదర్శిని "ఉభయభాషాప్రవీణ" యం. వేదవల్లి తాయారమ్మగారు తాము 1944 సం॥ నుండి నిర్వహించుచున్న సంస్కృత బాలికా పాఠశాల నివేదిక (1951-52 సం॥) ను ఆదాయవ్యయములను తెలిపిరి. ప్రస్తుతముగల పాఠశాలభవనమునకు విశాలమగు స్థలము లేనందున మరికొంత స్థలమును ముఖ్యముగా కొనవలసియున్నదనియు, అందులకు పురవాసులెల్లరు సహాకరించవలెనని చెప్పిరి.

పాఠశాల విద్యార్థినులకు వచ్చిన అతిథులకు అల్పాహారపువిందుగావింపబడెను. సమాజపక్షమున అధ్యక్షురాలికి చిన్న సన్మానము జరిపిరి.

తరువాత పాఠశాల బాలికలు, "ఆంధ్రమాతృస్తవము" "గాంధిజీనిర్యాణము బుఱ్ఱకథ" "పాదుక" తెలుగునాటకము, తాయిశాంతకుమారి అను బాలిక భరతనాట్యము, కడుమనోహరముగ ప్రదర్శించి ప్రేక్షకుల నానంద పరచిరి.

తరగతులలో ప్రథమ, ద్వితీయశ్రేణిలో వచ్చిన వారికి, నాటకము మొదలగువానినందు పాల్గొనిన బాలికలకు బహుమతులీయబడెను.

కార్యదర్శిని వందనసమర్పణ, "జనగణమన" గీతములతో కార్యక్రమము ముగిసినది.

## గ్రంథాలయ వార్షికోత్సవము (తాడేపల్లిగూడెం)

దీ 27-4-53 తేది మధ్యాహ్నం 3 గంటలకు, శ్రీశారదా గ్రంథాలయ భవనములో శ్రీమతి శ్రీమత్తిరుమల భాగ్యలక్ష్మమ్మగారి అధ్యక్షత క్రింద శారదా గ్రంథాలయము 20 వార్షికోత్సవము జయప్రదముగా జరుపబడినది. డా. జగన్మోహిని ప్రార్థనతో సభప్రారంభించబడెను. తరువాత మై. ఇందిరాదేవిచే జాతీయగీతములు పాడబడెను. కొమ్మూరి రాధాకుమారి వీణాగానముచే సభికుల నానంద పర్చిరి.

అధ్యక్షురాలిని పుష్పమాలాంకృతులను జేసి స్వాగత పత్రము సమితి ప్రసిడెంటు శ్రీమతి పట్నం రూపవతమ్మగారిచే యివ్వబడెను. తరువాత కార్యదర్శిని దామోజీపురపు లక్ష్మీ నరసమ్మగారు సంవత్సరనివేదిక చదివిరి. కోశాధికారిని శ్రీమతి తెతలి, సావిత్రమ్మగారు జమాఖర్చు చదివిరి. అధ్యక్షురాలు శ్రీ భాగ్యలక్ష్మమ్మగారు స్త్రీల యాదర్శము, దారి పవిత్రతను గురించి 2 గంటలు మృదుమధురముగా పుపన్యసించిరి తరువాత శ్రీమతి పట్నం రూపవతమ్మగారు ఎఱ్ఱా లక్ష్మీకాంతమ్మగారు దామోజీపురపు లీలగారు పుపన్యసించిరి, తరువాత కార్యదర్శిని అధ్యక్షులకు సభ్యులకు గ్రంథాలయంకు వున్న అప్పు. రు 1800లో పుదారులగు సోదరీ మణులెల్లరు శాశ్వత సభ్యులుగా జేరి సహాయము చేయవలెనని అర్థించిరి. అంతట శ్రీభాగ్యలక్ష్మమ్మగారు, ఎఱ్ఱా లక్ష్మీకాంతమ్మగారు శాశ్వత సభ్యులుగా జేరుటకు వాగ్దానంచేసిరి. "జనగణమనతో" సభసమాప్తము గావించబడెను.








## పులుసు (రకాలు)

అన్నసాధికమయిన వంటకాలలో పులుసు ఒకటి. దానిని అనేక రకములుగా తయారు చేస్తుంటారు.

## మెంతి పులుసు

చింతపండు నానబెట్టి అందులోనిపిప్పిని బాగుగా పిసికి పారవేసి చింతపండు పులుసును ఒక పాత్రలో పోసి అందులో కొద్దిగా పసుపు, మెంతిపొడి, ఉప్పు, కొత్తిమేరాకు, కరివేపాకు, ఇంగువ వేసి పొయిమీద నుంచి తెర్లనివ్వవలెను. దింపుటకుముందుకొద్దిగా బెల్లంకాని, చక్కెరగానివేసి దించవలెను. దానిలో తిరుగ పోతపోసి ఉపయోగించినచో రుచిగా నుండును.

## ముద్ద పులుసు

సాధారణమైన పులుసుకు, ముద్దపులుసుకుగల బేధమేమిటంటే ముద్దపులుసు ఎక్కువ ముక్కలుకలిగి ముద్దగా నుంటుంది; సాధారణపులుసు నీళ్ళగా నుంటుంది.

సొరకాయముక్కలు తరిగి ఒక పాత్రలోనుంచి అందులో కొద్దిగా నీళ్లుపోసి పొయిమీద పెట్టవలెను. ముక్కలు కొద్దిగా ఉడికిన తరువాత చింతపండు పులుసు, పసుపుపొడి, పెద్ద ఉల్లిపాయముక్కలు, ఉప్పు పచ్చిమిరపకాయముక్కలు, ఇంగువ, కొత్తిమేరాకు, కరివేపాకు అందులో వేసి బాగా ఉడికి ముద్దయగువరకు పొయిమీద నుంచవలెను. దించబోవుముందు చక్కెరగాని, బెల్లముకాని వేసి దింపి తిరుగపోత పోయవలెను.

చింతపండు పులుసుకు బదులు రామమునగకాయముక్కలుపయోగించిన మరింత రుచిగా నుండును.

వంకాయలు, బీరకాయలుకూడ ముద్దపులుసుచేయుటకనువైనవి.

## పప్పు పులుసు

కొద్దిగా కందిపప్పును ఉడికించి మెత్తగా ఎనపవలెను. అందులో ముక్కలుగా మునగకాయలుగాని, బెండకాయలుగాని, ఉల్లిపాయలుగాని, ముల్లంగికాని, బూడిద గుమ్మడికాయగాని తరిగివేసి చింతపండు పులుసుకలిపి పోయవలెను. అందులో పసుపుపొడి, ఎండుకారంకాని, పచ్చిమిరపకాయల ముక్కలుగాని వేసి కొంచము ఇంగువ, కరివేపాకు, కొత్తిమేరాకువేసి తెర్లనివ్వవలెను. దించిన తరువాత తిరుగపోతపోసి వాడనగును. ఇది సాధారణ పప్పుపులుసు.

సాంబారు (దక్షిణాది పప్పుపులుసు)కు తెర్లేదానికిముందు పచ్చిశనగపప్పు, ధనియాలు, ఎండుమిరపకాయలు వేయించి వానితోటి పచ్చికొబ్బరినిచేర్చి మెత్తగానూరి పులుసులోకలిపి తెర్లనీయవలెను. సాంబారుకయినచో పచ్చిమిరపకాయలు తరిగివేయనక్కరలేదు. ఇది రుచికరమైనదేకాక పుష్టికరమైన అన్నసాధకం కూడాను.

# నిస్పృహత



శ్రీ దొండపాటి రామమూర్తిగారు

(గతసంచిక తరువాయి)

ఆలోయలోఁగాన నాంచలమున నొక్క గొల్లఁడు వసియించుగోపనాముఁ
డాతఁడు వృద్ధుఁడు, స్వాంతములావ్రను నవయవ దార్ఢ్యంబు నలరువాఁడు
బాల్యాది వార్ధక్య పర్యంతమంగ సంఘటనన సామాన్య పటిమవాఁడు;
చురుకును, దీవ్రత, పరిమిత వ్యయశక్తి సర్వార్థ యోగ్యప్రజ్ఞయుఁగలండు.
మఱియునాతఁడు తనగోపకరణమందుఁ దక్క-సామాన్య నరులనందఱనుమీఱు
సంతతోద్యుక్తుఁడగుటను జాగరూక తాపరిస్ఫూర్తిగొన్న చిత్తమునునుంట॥

ఈరీతిగా నాతఁడెల్ల వాయువులయు ఝంఝూమరున్నాద జాతములయు
నర్థమెఱిఁగె; దాననందఱుఁ దలఁచుగా నశ్రద్ధగొన దక్షిణానిలమ్ము
ధారుణీగర్భోద్గతంబగు సంగీత మలదవ్వులంగల మలలమీఁది
భక్తిగీతల శబ్దవైభవంబునుబోని దానినిజేయఁగాఁ దానువినును
ఈ పగిది హెచ్చరికతటి గోపకుండు
తలఁచుఁడినమందఁగూర్చి స్వాంతమ్మునందు
''పనిగొలుపుచున్న విభుడు నాకనిలగతులు''
అనుచు లోలోననాతండు గొణఁగికొనును॥

తనగతిచేతఁ బాంథుఁ దలఁడాచుకొనంగనుద్రోలు గాలివా
ననునతఁడేగుఁ గార్యకలనకై సతతమ్ము నిజమ్మగాళికిన్;
తనదెసవచ్చి చుట్టుకొని తన్నుడఁబాసి సహస్ర సంఖ్యలై
చనుపొగమంచు మధ్యములజాఱి యతండొకరుండ నిల్చెడిన్.

ఎనుబదియేండ్ల ప్రాయమిటులే కడతేర్చెనతండు, 'పచ్చనా
కనుమలు నిర్ఝరుల్ గిరులుగా వలయున్ బసుపాలుభావనా
వనధికివీక్షణీయ విభవంబుల'టంచుఁ దలంచు నెవ్వఁడ
జ్ఞుఁడు భ్రమప్రమాదముల జాడలఁగూడినవాఁడ నందగున్॥

స్వచ్ఛందమా జగత్ప్రాణంబు నెచటఁ దాశ్వాసింపఁగలిగె నుత్సాహమతిని
సతతమారోహింపఁజాలె నెయ్యవితాను దృఢపదన్యాస నిర్నిద్రమతిని

కదియించెమదినెవి కష్టచాతుర్య ధైర్యానందభయ సంవిధానకృతిని
జతపర్చెనెవి గ్రంథగతిని దారక్షించి మేపిపెంచిన మూకమృగములస్మృతి
ఇట్టికృత్యంబులకు ముడివెట్టుకొనుచు నిశ్చయించును ఋజుమార్గ నియతినెందు
నట్టిపాలములు గుట్టలు నతనిమదికి నలంతులగునని యెట్టుల నగువచింప ॥

పాలించెనతని కరుణాశీలత నాదృశ్యమెల్ల, జీవితమునకున్
మూలంబగు ప్రేమాంధత కాలంబనమయ్యె నతనియాత్మకు నదియున్ ॥

ఒంటివాతఁడు దినముల గెంటలేద, అతని సహకారిణి, మనోజ్ఞమైన గృహిణి
వరునికన్నను నిండుగా నిరువదేడు లీడునంజిన్నదైనను వృద్ధురాలు ॥

హాయియు విసువును నెఱుఁగనిదై యుండున్ జీవనము తదంబుజముఖికిన్,
బాయక యాయమ హృదయంబే యెడఁ దనయింటియందె యిరవై యుండున్ ॥

రాట్నములు రెండుగలవు పురాతనమ్ము
లల్ల పెద్దదియున్ని యీయలతిఁనార
వడుకుటకునామె వినియోగపఱుచు, నొకటి
విరతిఁగొనెనేల నమఱొండు తిరుగుచుండె ॥

'కాటికిఁ గాళ్లుసాపుకొను కాలమ'టంచును నవ్వులాడు న
మ్మాటలఁ దన్నుఁగూర్చి పలుమారతఁ డెంచుజరన్ దదేకుఁడై
వాటిలినట్టియొక్క పసిపాపడె యిర్వుర కింటియందుఁ దో
డ్పాటయి చేయుచుండుఁ దనప్రాయమునన్ దగురీతిగాఁ బనుల్ ॥

వెలయిడరానిదై కడిమిపెంపున నింపయి పెక్కుగాలి వా
నలఁగడతేఱినిల్చినదనందగు మందసు నిద్వయంబుతో
నలబుడు తండ్రొకండె తెలియంబడు వారికుటుంబమెల్లయై
నిలుతురువారు సామెతగ నిత్యపరిశ్రమ కల్లలోయనన్ ॥

దినకరుఁడస్తమించినఁ దదీయబహిర్గృహ కార్యజాతమె
ల్లను ముగియించి మందిరతలంబునఁ జేరినవైన, దండ్రియున్
దనయుఁడు ; రాత్రిభోజన మొనర్పఁగ నెల్లఱుఁగూడియుండు నం
దనుకనుగాయ కష్టము తుడంగనలేదనవచ్చు వారికిన్ ॥

(సశేషము)

# చర్మబాధలకన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనియై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది. కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్ల పగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.






## బిడ్డల ఆరోగ్యమునకు

## ప్రసిద్ధిచెందినది:

# రమణీస్
# బేబి గ్రైప్



తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కో., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెన్సీస్ - విజయవాడ, శికింద్రాబాద్, బరంపురము (గంజాం), బొంబాయి.

# జానకి

శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

జానకి వంటావిడను వంట పురమాయించి తను పలహారము చేసి వెండిగిన్నెలో మూత పెట్టి, ఫ్లాస్కులో కాఫీపోసి బల్లమీద వుంచింది. తను చక్కగ ముస్తాబై వాకిట్లోకివచ్చి భర్తరాకకు ఎదురు చూస్తూ నిలుచుంది. రోడ్డుమీద ఎవ్వరు కనుపించలేదు. దూరంగా తన కొడుకు మోహను మాత్రము సంచి మెడలో తగిలించుకుని గంతులేస్తూ బడినుంచి వస్తున్నాడు.

మోహను యింటికి రాగానే వాడికి పాలు, టిఫిన్, యిచ్చి వాడిని ఆడుకోను పంపివేసి తిరిగి వాకిట్లోకి వెళ్లింది భర్తరాకకోసము. ఈ మాటు ఆఫీసు కాగితాలు చంకపెట్టుకుని బడలికగా వస్తున్నాడు తనభర్త రామారావు. అతను యింటికిరాగానే ఆఫీసు కాగితాలు అందుకొని టేబిలు మీదవుంచి రామారావు కోటు అందుకొని చిలక్కొయ్యకు తగిలించి, అతను ముఖము కడుక్కోటానికి సబ్బు తువాలు అందించింది. భర్త కాళ్లు ముఖము తుడుచుకుని టేబిల్ మీద టిఫిను తీసుకోడాని కూర్చోగానే తను ప్రక్కను కూర్చొని, కబుర్లు చెప్తోంది. ఇంతట్లోకి వాకిట్లో పోస్టు వాని కేక వినపడింది. జానకి, వెళ్లి వుత్తరము అందుకుని, చింపి చదువుతూ "మీమామయ్యగారి కమల రేపు సాయంకాలము బండికి వస్తోందిట." అన్నది. "ఆ! కమలా? ఎందుకు?" అన్నాడు రామారావు విస్తుపోతూ. "ఎందుకేమిటి? నేనే మొన్నను రమ్మని వుత్తరము వ్రాసాను" అంది.

"నాతో చెప్పకుండా? నాకు తెలియకుండా నే?" మనయింటికి ఎవరిని పిలవాలో యనీ నాకు తెలియదంటారా? యింత చిన్న విషయానికి యెందుకని మిమ్మలను అడుగలేదు అయినా మీరూ మీ మైత్రియినింగు రెండు ఏండ్లు వాళ్లయింట్లోనే వుండి చదివితిరి కదా! మనము విడిగా వుంటున్నప్పుడు ఆమాత్రము వాళ్లను పిలిచి మర్యాద చేయనక్కరలే? మీరు ఎప్పుడు యింతేనండీ! మీకు పొరుగు గిట్టదు. ఏదో నాలుగురోజులపాటు సరదాగావుండి వెడుతుంది అంతేగా?"

"ఏమో నాకు నచ్చలేదు. మనదోవను మనలను కుదురుగ వుండనీయకుండా నీవు ఏదో ఒకటి చేస్తుంటావు జానకీ!" నీవు.

"మనము సరదగా వుండటానికి ఆవిడవస్తే మాత్రము ఏమి?" కమల రామరావు మేనమామకూతురు. తల్లిలేదు. పెద్దవాడు తండ్రిమాత్రము వున్నాడు. ఈవిడకు పెళ్లి అయిన కొద్ది రోజుల్లోనే భర్త పోయాడు. కమల తండ్రిని కనిపెట్టుకుని వుంటుంది. రామారావు తన మామయ్యబలవంతంమీద వారింటి దగ్గరేవుండి తన వుద్యోగపు ట్రెయినింగు చేసేడు. కమల అందకత్తె కాకపోయినా కలివిడిగావుంటుంది. బావ రామారావు దగ్గఱ చనువుగా వుంటుంది. జానకిని పెళ్ళిలోతప్ప తిరిగి చూడలేదు కమల.

జానకి స్టేషనుకువెళ్ళి కమలను తీసికొనివచ్చింది. అంతా సరదాగా వుంటున్నారు. జానకి, కమల ఎంతో స్నేహముగాకలిసి తిరుగుతూ వుంటున్నారు. ఇలా ఒక పదిరోజులు గడిచిపోయినాయి. ఒక రోజు జానకి అన్న మాధవరావువద్దనుంచి వుత్తరము వచ్చింది. దాంట్లో జానకి వదిన మాలతికి వంట్లో కులాసాగాలేదని జానకిని నాలుగురోజులపాటు సాయంరమ్మనివుంది. జానకి భోజనాలప్పుడు రామారావుతో "మా అన్నయ్య దగ్గఱనుంచి మా వదినకి వంట్లో బాగాలేనట్టు నన్ను సహాయము రమ్మని వుత్తరము వచ్చినదండీ! నేను రేపువెళ్ళి నాలుగు రోజులు వుండివద్దామని అనుకుంటున్నాను" అన్నది.

"మీ అన్నయ్య హోదాకలవాడుకదా! నౌకరులను పెట్టి చేయించుకోలేడూ? మధ్య నీవెందుకూ?"

"ఎంత నౌకరులైనా ప్రేమగా చేస్తారా? ఏదో చెల్లెలినికదా! అని రమ్మంటాడు? యింతట్లోకి వెళ్ళితే ఏమి?"

"ఏమో ! నీకంత యిదిగావుంటే వెళ్లు ! కమలా! మాడు జానకి అర్థములేని చాకిరీ చేస్తా నంటుంది" అన్నాడు రామం.

"పోనీలే బావ! వెళ్ళిరానీ ఏదో నేను యింట్లో వున్నానుకదా ! నేను చూచుకుంటాను ఆ రెండు రోజులు యింటి సంగతి" అన్నది కమల.

జానకి పన్నెండు గంటల బండికి బయలు దేరింది. బండిలో తన జీవితాన్ని ఒక్కమాటు పర్యాలోచించుకుంది.

రామారావు తనూ కాలేజీలో క్లాసుమేట్సు. వీళ్లది అట్టే డబ్బుగల కుటుంబము కాకపోయినా మంచి సాంప్రదాయముకలది. తను, రామారావును చేసుకుంటాననడము తన అన్నయ్యకు యిష్టములేదు, తనకు తల్లి తండ్రులు లేరు. కాని పట్టుదలతో తను రామారావును చేసుకుంది. చేసికొన్నందుకు తను, రామారావు అన్యోన్యముగా వుంటున్నారు. ఆదర్శముగా తన సంసారము నడుపుతోంది. ఇప్పుడు తన భర్త మంచి వుద్యోగము చేస్తున్నాడు. ఉన్నంతలోనే ! ఒక చిన్నయిల్లు కట్టుకున్నారు. హంగుగానే యింటిని అమర్చింది. కాని తనకు జీవితములో తృప్తిలేదు. అలా పైకివెళ్ళిపోవాలి, తనూ, తన భర్త తన సంసారము అందరిలోనూ ఎలాగైనా మిన్నగా వుండాలి. అది తన జీవిత లక్ష్యము తన భర్తకు అలాంటి ఆశలేదు. ఏదో సంపాదించుకుంటున్నాము. ఇలాగ నెమ్మదిగా, శాంతముగా జీవితము నడిస్తే చాలంటాడు. తన కుదరదంటుంది. తెల్లవారిలేచిన దగ్గరనుంచి భర్తకు అన్ని వేళలపట్టుగ దేనికి తడుముకోకుండ తను అమర్చి పెట్టుతుంది. చివరికి భోజనము విషయముగూడ జాగ్రత్తగ ఏ ఏ వేళలలో ఏమి ఏమిటి పుచ్చుకోవాలో శాసించినట్టే. తను వూరికి తిరిగివెళ్ళి తన భర్త పైఆఫీసరును టీ పార్టీకి పిలవాలి. అయినా తన భర్త వుత్త అమాయకుడు. బ్రతుకు తెరువులే తెలియవు. ఆ మేనేజరును మంచి చేసుకుని అలాపైకి పోవడమే తెలియదు. అన్నీ తను చెప్పాలి, నేర్పాలి. ఎంతకని, ఎన్నిటికని తను తంటాలుపడగలదు. యిలా ఆలోచించుకుంటూ అన్నగారివూరు చేరింది జానకి. మాధవరావు కారు పంపాడు జానకికి. కారు యింటి ముందు నిలవగానే మాధవరావు వాకిట్లోకి వచ్చాడు. "నీవు తప్పక వస్తావని అనుకున్నాను జానకీ మీవదిన మేడమీదవుంది చూద్దువుగాని రా! "

మాలతి మాగన్నుగ పడుకునివుంది. తల చక్కగ దువ్వుకుని రెండు జడలు వేసుకుంది. తెల్లటి జరీచీర కట్టుకునివుంది. మొహములో కొంచెము బలహీనత కనుపిస్తోంది. అంతే! నళిని, శంకర్ వాళ్లపిల్లలు యిద్దరు గదిలో ఆడుకుంటున్నారు. మాలతి భర్తను చూడగానే మెల్లిగా "ఆపిల్సు పట్టుకొచ్చారా ! ముక్కలుకోసి పెడుతారా" అంది. మాధవరావు ఆపిల్సు ముక్కలుకోసి మాలతి ప్రక్కలో కూచుని పెట్టుతున్నాడు. మధ్య మధ్య కురుల్లు దువ్వుతూ ముద్దుచేస్తున్నాడు. తనకు సిగ్గువేసింది.

"ఛీ, వేవిళ్లకేనా ? యింత హంగామా ! సిగ్గు లేకపోతేసరి. అయినా సాగితేసరి."

మాధవరావు "మాలతీ జానకి వచ్చింది చూశావా" అన్నాడు. మాలతి, ఒక్కమారు మెల్లిగా కళ్లువిప్పిచూచి మూతి ముడుచుకుని అటువైపు ఒత్తిగిలింది. జానకికి చిరాకు వేసింది. జానకి అన్నయ్యా పిల్లల సంగతి అంతా కనుక్కొని తనూ భోజనము చేసింది. అన్నయ్య ఆఫీసునుంచి వచ్చే టప్పటికి అతనికి యిష్టమైన టిఫినుచేసి వుంచింది. పిల్లలను ముస్తాబుచేసింది. అన్నయ్యా టిఫిను తింటున్నంత సేపు "జానకీ మాలతివంట టిఫినులు ఎంత బాగా రుచిగా చేస్తుందనుకున్నావు. అది చెయ్యాలి ఏవైనా తినాలి. పాపము రెండురోజులకే ఎలా అయిపోయిందో. ఆఫీసు కెళ్ళినా దానిని తలచుకుంటే పనిచేయ బుద్ధివేయలేదు. అంచేత త్వరగా వచ్చేనేను" అంటూ మాలతి గొడవే చెప్ప మొదలెట్టేడు. జానకి అలాగే ఓపికపట్టి ఆ నాలుగు రోజులు ఎలాగో వుండినది. మాలతి సహాయమునకు ఒక మనిషిని కుదిర్చాడు మాధవరావు. జానకి

"అన్నయ్యా నేను పగలుబండికి వెళ్లిపోతాను, యింటి దగ్గర యిబ్బందిపడుతుంటారు. నీమాట కాదనలేక వచ్చాను" "సరే! డ్రైవరుచేత టికెట్టు పంపుతాను. వాడు నిన్ను బండి ఎక్కిస్తాడు."

## 3

జానకి ముందుగా తన రాకను రామారావుకు వ్రాసింది. తను స్టేషనుకు వస్తాడని అనుకుంది. స్టేషనులో బండిదిగి చూచింది. రామారావు రాలేదు. తనకు కొంచెము చిరాకు వేసింది. సరాసరి బండిలో వెళ్ళి యింటిదగ్గర దిగింది. రామారావు, కమలా హాలులో కూచుని సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నారు. వేళగాని వేళన టీ కూడ త్రాగుతూ వున్నాడు రామారావు. జానకికి కోపము వచ్చింది. తను నాలుగురోజులు యింట్లో లేకపోతే అంతా తారుమారే! తను దూకుడుగా హాలులోకి వెళ్లింది. రామారావు కొంచెము వులిక్కిపడి "అప్పుడే ట్రైయిను వచ్చేసిందా! ఏదో తలనొప్పిగావుంది అంచేత ఆఫీసుకు వెళ్లలేదు, స్టేషనుకు రాలేకపోయినాను" అన్నాడు. సంగతి గ్రహించుకుంది జానకి. రాత్రి భోజనాలప్పుడు కమల ఏదోమాటల సందర్భములో "రామం, నీవు పెళ్లిఅయిన తర్వాత యిలా వంటింటి కుందేలి వయ్యావేమిటి. ఒక కబుర్లు కాని, సరదాలు కాని వుండక్కరలేదూ. ప్రేమ, ప్రేమ అని సంకెళ్లు వేయించుకుంటావా" అంది. రామం "ఏం నామట్టుకు నాకేమి సరదాగానే వున్నానే" అని మాత్రము అన్నాడు. కమల చలోక్తిగా జానకితో. "జానకీ నీ చేతులో దేవుడు చిక్కి.నా మెడకు తాడువేసేలాగున్నావే" అన్నది. జానకి ఎన్నో తియ్యటి కలలుకంటూ వూరినించి వచ్చింది. కాని రామారావు ప్రవర్తనలో మార్పు వున్నట్లు అనుమానము తోచింది. తనువేసే ప్రతి ప్రశ్నకు, కబుర్లకు చిరాకుగా జవాబులివ్వటము లేకపోతే నిద్రవస్తుందనో తప్పుకుంటున్నాడు రామారావు. రాత్రి అంతా ఏవో ఏవో ఆలోచనలలో నిద్రలేకుండా గడిపింది జానకి.

## ౪

అనుకున్నట్లుగా తర్వాత జానకి రామారావు ఆఫీసు మేనేజరును టీ పార్టీకి పిలిపించింది. ఏవేవో క్రొత్త క్రొత్త టిఫినులు చేసింది. టీపార్టీ అంతా చక్కగా తయారుచేసింది. మేనేజరు వచ్చాడు. తను కమలా, రామారావు అంతాకూడ కలిసి టీ పుచ్చుకుంటూ కబుర్లు సరదాగా చెప్పేసుకుంటున్నారు. "ఏమండీ! రామారావుగారు, నమ్మకంగా పనిచేస్తున్నారుకదా! వారికి పైప్రమోషనులు మీరు యిప్పించకూడదు" అంది. వారికి అలా అల్లుకపోవడము చేతకాదు జానకి. మేనేజరుగారు "మీ తెలివి తేటలకు చలా కీతనానికి మీరే అప్లయిచేస్తే మీకే యీ వుద్యోగము ప్రమోషను యిస్తాను" అని చలోక్తిగా నవ్వారు. "నాసంగతి నేను చూచుకోగలనులే జానకీ!నీకెందుకు" అన్నాడు రామారావు. "అయినా ఆఫీసు గొడవలు మనకెందుకులెద్దూ జానకీ" అంది కమల. ఈ అంత్షల్లాంటి కబుర్లతో జానకికి చిరాకెత్తింది. తను ఏది తలపెట్టినా యిలా జరుగుతోందని, దీనికి కారణము కమలేనని, కమల కబుర్లతో రామారావు మారిపోయేడని, కమలమీద యీర్ష్యపడింది. ఎంతో సరదాగా తను ప్రారంభించిన టీ పార్టీ ఎప్పుడెప్పుడు అయిపోతుందా అనిపించింది జానకికి. రామారావు, కమల మాట్లాడుకోవటము అన్నీకూడ తనకు అనుమానాస్పదముగా వుండటము మొదలెట్టింది. వారి ప్రతిచర్యకని పెడుతూ వచ్చింది. ఈ అనుమానముతోటి తనలో అశాంతి బయలుదేరింది. తన యింటి వాతావరణములోనే మార్పు, అశాంతి వచ్చినట్లు తోచింది.

## ౫

రామారావుకు యిద్దరు అన్నగార్లు, ఒక విధవ అక్కగారు వున్నారు. పెద్దన్నయ్యకు ఆ వూళ్ళో ఏదో చిన్న వుద్యోగము. భార్యలేదు. దూరపు చుట్టము ఒక ముసలమ్మ యిల్లు కనిపెట్టుకునివుంది. యింకొక అన్నగారు పైవూర్లో వ్యాపారము చేస్తు

న్నారు. అతనికి పిల్లలు, భార్యా వున్నారు. భార్య జబ్బుమనిషి అయినందున అక్కగారూ అతని దగ్గఱ వుంటోంది. జానకి రామారావుతో ఒకరోజు "ఏమండీ నేనూ కమలా, మోహను రేపు మీ అన్నయ్యగారింటికి వెళ్లి వస్తాము. మీకు ఆఫీసు పనులున్నాయి కనుక మీరు యింట్లోవుండి కాస్త చూస్తూ వుండండి" అని అంది. "సరే, అలాగే వెళ్ళండి" అన్నాడు రామారావు.

కమల మోహను తను వెళ్లేరు. అక్కడ సాయంత్రం వరకు సరదాగా గడిపేరు. కమల లోపలమాట్లాడుతోంది. జానకి మంచినీళ్ళకోసమని వంటింటిలోకి వెళ్ళింది. అవ్వగారు మంచినీళ్లు అందించుతూ "జానకీ! కమలను తెచ్చి మీయింట్లో అట్టిపెట్టుకున్నావేం" అంది. "ఏమి" అంది జానకి. "ఇంకా నీకు తెలియదూ! మీవారు చెప్పలే. భర్తపోయిన తర్వాత దానికొక పిల్లాడుపుట్టి కొన్ని రోజులు పెరిగికూడా పోయినాడుట" అంది అవ్వగారు. జానకికి తలతిరిగినంతపనైంది. రామారావు మొదటే యీ సంగతి తనకు చెప్పలేదని కోపము వచ్చింది. ఇంక ఒక్క క్షణము ఆ యింట్లో వుండబుద్ధికాలేదు. ప్రొద్దుపోయిందని అందరు తిరిగివచ్చేసేరు. రాత్రి రామారావుతో "ఏమండీ కమల సంగతి నాకేమి చెప్పలేదేమిటి" అని తనువిన్న సంగతి చెప్పింది జానకి. రామరావు "ఏమో, పుట్టిపోయాడేమో నాకు తెలియదు." "అందరికి తెలిస్తే మీకు మాత్రము తెలియకుండా వుండివుండదు. నాతో కావాలనే చెప్పలేదు. మీరు వాళ్ళ యింట్లో వుంటున్నప్పుడు మీరిద్దరుకలిసి సరదాగా కబుర్లు చెప్పుకునేవారు కాబోలు." "చెప్పుకునేవాళ్ళం" "అవున్లెండి ఆవిడ తండ్రిగారు ముసలాడు ఎక్కడో వుండేవాడు. అడ్డుపెట్టడానికి తల్లీ లేదూ యింక మీకేం అడ్డం" "ఒక యింట్లోవుంటూ కబుర్లు చెప్పకుండా ఎలావుంటాము" "మొదట్లో కమలరాక మీకు యిష్టము లేకపోయినా యిప్పుడు సరదాగానే వున్నారుగా!" "ఛీ నోరుమూయి, మొదట నాకు యిష్టములేకుండా పిలిపించావు యిప్పుడు రంకు కట్టుతున్నావు" "చాలు యింతోటి పతివ్రతను వెనకవేసికొస్తున్నారు" "అధిక ప్రసంగము చేయక వెళ్ళిపో" అన్నాడు కోపంతో రామారావు. ఆ రోజునుంచి రామారావు బయటహాలులో పడకవేసుకుంటున్నాడు. జానకి కంటబడడమే తప్పించుకోసాగాడు. ముక్తసరిగా మాట్లాడేవాడు. వీరిద్దరికి ఏదో సంబంధము వుండివుంటుందని రోజు వీలుచిక్కినప్పుడల్లా రామారావును వత్తిడిచేసేది జానకి. భార్యాభర్తల మధ్య ప్రవర్తనలో సరళత పోయింది. ఒక రోజు కమల "జానకీ అలా బజారు వెళ్లివస్తానని" వెళ్ళిపోయింది. జానకి కమల గదిలోకి వెళ్ళింది. గది అంతా సామానుపరిచి చిరాకుగావుంది. జానకి అన్నింటినిచూసి సర్దిపెట్టింది. కమల బొట్టుపెట్టె తెరిచిపడేసివుంది. జానకి దానిని మూద్దామని అయినా దానిలో ఏమేమిటి వున్నాయా అని చూసింది. సగం అయిపోయిన పౌడరు డబ్బా, స్నో వున్నాయి పైసొరుగులో. క్రిందిసొరుగు లాగింది. దానిలో అంతా అలుక్కుపోయి సరిగా కనబడని ఒక చిన్నబిడ్డ ఫోటోవుంది. ఇది కమలకు పుట్టిపోయినబిడ్డగాబోలు. అందులో అస్పష్టముగా వున్న పాపపోలిక కొంచెము తన మోహనులా వుంది. ఇంకేమి తన అనుమానము రూఢిఅయిపోయింది. అంచేతే రామారావు తన ప్రశ్నలకు సరియైన జవాబు యివ్వడములేదు అని నిశ్చయించుకుని ఆ గదిలోనించి వచ్చేసింది. ఇంక ఒక్క క్షణముకూడా కమల ఆ యింట్లో వుండటానికి వీలులేదు. వుంటే తనకే ముప్పు. ఇలా చిరాకుతో, అవమానముతో జానకి వున్నప్పుడు కమల బైటకివెళ్లి వచ్చింది. దానిని చూడగానే జానకి ఏమీమాట్లాడకుండా పనివానిని పిలిపించి బండీ తెప్పించి "ఓరే కమలమ్మగారి ఆ సామానంతా బండిలో పెట్టించు. సాయంకాలము ఆరింటి బండికి వెళ్ళిపోతున్నారు" అంది. వారం రోజులనుంచి జరిగే విషయాలు గమనిస్తూవున్న కమల "అంత తొందరేం జానకీ! ఎలాగు రేపు వెడదామని, యిప్పుడే వుత్తరంవ్రాసి పడేసివచ్చేను" అంది. "అది అంతా నాకు తెలియదు. నీవు తక్షణం నాయింటినుంచి వెళ్ళిపోవాలి" అంది రోషముగా జానకి. "కమల

బండి ఎక్కుతూ నాదేమిపోదు, నాకోసము ఏడ్చే వాళ్ళు ఎవరూలేరు, నీకొంపకు నీవే చిచ్చుపెట్టుకుంటున్నావనేది మాత్రము మరచిపోకు” అంటూ వెళ్ళిపోయింది. జానకి ఏమీమాట్లాడలేదు, కోపంతో కంపించిపోతోంది.

జానకికి యింట్లో జడివానకురిసి వెలసినట్టుగా యిల్లు ప్రశాంతముగావుంది. భర్తకోసము చక్కగా ముస్తాబై ఇంక తను తన భర్త వెనుకటిలాగా సరదాగా వుండవొచ్చుననుకుంటూ తీయటి కలలుకంటూ భర్తరాక ఎదురు చూస్తోంది. వీధి తలుపు దగ్గఱగా వేసి హాలులో చదువుకుంటోంది. రామారావు లోపలికి వచ్చాడు. జానికిలేచి వుత్సాహంగా ఎదుర్కొన్నది. “నీవు ఒక్కతే వున్నావేమి ? కమల ఏది” ? అన్నాడు రామారావు. “కమల వూరికి వెళ్ళిపోయింది సాయింకాలము ప్యాసెంజరుకు” అంది జానకి. “ఏమంత అవుసరము నేను వచ్చేలోగానే వెళ్ళిందే ! నిన్నకూడ వెడతానని అనలేదే ?” “ఎందుకు ! నేనే పంపేశాను ! నాకు ఆవిడను చూడబుద్ధికాలేదు. యింక మనము సరదాగా గడపవొచ్చు” అంది. “ఛీ, పశువా ? ఏమిపని చేసేవు ? మర్యాదలేకండా నిన్ను అసలు పిలవమన్నదెవరు ?” కోపంతో అని మళ్లీ మాట్లాడకండా గిర్రున తిరిగి తలుపు దభీమనివేసి వెళ్ళిపోయినాడు రామారావు. జానకి అలాగే నిలబడిపోయింది రామారావు ప్రవర్తన అర్థంకాకండా :—

రామారావు సరాసరి స్టేషనుకు వెళ్లినాడు. స్టేషనులో కమల సామాను పెట్టుకుని నిల్చునివుంది. కమల స్టేషనుకు వచ్చేటప్పటికి, రైలు వెళ్లిపోయింది. మర్నాడు సాయింకాలానికిగాని ప్రయాణం జేయలేదు. రామారావు కమల సామాను వైటింగు రూములోవుంచి, యిద్దరుకలిసి హోటలులో భోంచేసి, రెండో ఆట సినిమాకు వెళ్లేరు. తర్వాత కమలను హోటల్లో ఒక రూములోవుంచి తను రాత్రి రెండు గంటలకు యింటికి వెళ్లేడు. రామారావు కోసము ఎదురు చూచి చూచి జానకి పడుకుంది. రామరావు పైకివెళ్ళి జానకిని పలకరించనైనా పలకరించకుండా పడుకున్నాడు. తెల్లారి జానకి కమల సంగతి అడిగింది రామారావుని. అతను కమల నిన్న వూరువెళ్ళలేదని, యీ రోజు వెడుతుందని చెప్పేడు. తెల్లారిన దగ్గరనుంచి ఆ రోజు ఒకటే విడవని పెద్దవర్షము కురుస్తోంది. ఇంకా సాయింకాలములోగా పెద్ద తుపాను రాగలదని ప్రత్యేక బులిటీనుకూడ వచ్చింది. కాని జానకి మనస్సులో యింతకు మించిన తుపాను చెలరేగుతోంది. ఈ రోజు సాయింకాలము రామారావు తప్పక కమలకోసము వెడుతాడు. నిజంగా కమల వెడుతుందో లేక వీళ్లు యిద్దరు యింకెక్కడైనా మకాంపెట్టారో అని అనుమానము వేసింది జానకికి. రైలు టైముకు సరిగా తను టాక్సీ తెప్పించింది వారిని కనిపెడదామని. ఇవతల మనిషి అవతల కనుబడనటువంటి కుంభపోత పోస్తూంది వర్షము. టాక్సీవాడు యీ వానలో వెళ్ళటము మంచిది కాదన్నాడు. కాని జానికి వినిపించుకోలేదు. అదృష్టవశాత్తు జానికి టాక్సీకి ముందు టాక్సీలో రామారావు కమల కనిపించారు. ఆ టాక్సీ స్టేషనులోకి తిరగబోతోంది. ఎలా జరిగిందోకాని కమల కారు జానకి కారు రెండు ఆ వానలో గుద్దుకున్నాయి. ముందు టాక్సీలో రామారావుకు బలమైన దెబ్బలు తగిలాయి. కమలకు దెబ్బలు తగిలాయి. అందరు పోగైనారు. రామారావును, కమలను హాస్పిటలులో చేర్పించారు. జానికి, రామారావునుచూచి ఏడవటము మొదలిట్టింది. రామారావు కళ్లువిప్పి చూశాడు. జానకిని రెండు చేతులు పట్టుకొని “జానకీ అబ్బా బాధ నేను బ్రతకనేమో ? నిజంగా నాకు కమలకు ఎలాంటి సంబంధము లేదుసుమా. నన్ను అనుమానించకు జానకీ” అంటూ జానికి చేతుల్లో ప్రాణాలు విడిచేడు. జానకికి ప్రపంచమే విరిగి మీద పడ్డట్టు అయింది. ఇంక తను తనరామారావు లేకుండా బ్రతకడము ఎలా! ఒక్కమాటు ప్రపంచము అంతా చీకటి అయిపోయినది జానకికి.

(సశేషము)




# హృద్రోగానికి చికిత్సలు

'సిసి'

ఆముదము, ఇంగువ, కుంకుమపువ్వు, తేయాకు, ధనియాలు, పుల్లబచ్చలి, మెంతికూర, మిరియాలు, వెల్లుల్లి మన గృహములలో సర్వసాధారణముగా వాడబడేవి.

ఆముదమును పుదినాఆకు కలిపి వెచ్చజేసి పరిమితంగా సేవిస్తే హృద్రోగము ఉపశమించును.

ఇంగువ దక్షిణాదిన వంటకాలలో విశేషంగా నుపయోగింపబడుతున్నది. ఇంగువ వాడకంవలన ప్రత్యేకమయిన రుచి, వాసన సమకూరి వంటకములు రుచిగా తయారగుతవి. అంతేకాక ఆరోగ్యాభివృద్ధికి ఇంగువ ఎంతో ఉపకరిస్తుంది. హృద్రోగముచే బాధపడువారు 5 మొదలు 15 గోధుమగింజలఎత్తు ఇంగువను ప్రతిదినము సేవిస్తే నివారణమగును.

కుంకుమపువ్వు సువాసన ద్రవ్యాలలో నొకటి. వైద్యోపయోగకరమయినది కూడాను. సాధారణంగా హల్వా, పాయసం, లడ్డు మొదలగువాని తయారీలో కూడ కుంకుమపువ్వు వాడబడుతున్నది. పాయసంలోగాని, చక్కెరకలిపిన పాలలోగాని దినమునకు 2 మొదలు 20 గోధుమ గింజలఎత్తు కుంకుమపువ్వు కలిపి సేవించినచో గుండెకు బలము సమకూరును.

తేనీరు హృద్రోగ బాధితులకు చాల మేలు చేయును.

ఆకు కూరలలో పుల్లబచ్చలి (చుక్కకూర,) మెంతికూర హృద్రోగ ఉపశమనానికి చాల మేలుచేయును.

కొద్దిగా కందిపప్పును ఉడికించి అందులో మెంతికూరగాని, పుల్లబచ్చలికూరగాని వేసి పప్పుకూరగా చేసికొని ఆహారంగా సేవించవచ్చును. అందులో వెల్లుల్లిపాయలను వాడటం మరింత శ్రేష్టం.

హృద్రోగ బాధితులు వెల్లుల్లి రెబ్బలతోలు తీసివేసి నేతిలో వేయించి పొయి మీదినుండి దించడానికి ముందు మెత్తని ఉప్పును కొంచెంకలిపి దింపి ప్రతిదినం సేవించి నచో ఆరోగ్యము సమకూరును.

ధనియాలు, మిరియాలు మనయిండ్లలో చారులో వాడతారు. ధనియాలను పరిమితంగా ఎండుమిరపకాయలను దోరగా వేయించిదించి, అందులో తోలుతీసిన వెల్లుల్లి రెబ్బలను, ఉప్పును, కొద్దిగా చింతపండుకలిపి మెత్తగా పొడిచేసి అన్నసాధకంగా వాడటంకలదు.

ధనియాలను కాఫీగింజలులాగ వేయించి పొడిచేసి దానితో కషాయముతీసి వడియ గట్టి, పాలుచక్కెర దానితోకలిపి కాఫీకి బదులుగా కొందరు సేవించుచున్నారు.

మిరియాలను ఒక ఇనుప గరిటెలో తీసికొని అందులో నెయ్యివేసి పొయ్యిమీద చిటపట వేగునప్పుడుతీసి దానిని మొదటి అన్నపు ముద్దలో సేవించడం ఆరోగ్యకరమని కొందరి అభిప్రాయము.

పై విధములుగా ధనియాలు, మిరియాలు వాడటంవలన హృద్రోగము ఉపశమించును.

తియ్యటి నేరేడు పండ్లను ఉప్పుతో చేర్చిగాని, పుల్లటి పండ్లను ఉప్పు శొంఠిపొడిని చేర్చిగాని సేవించడమువలన హృద్రోగ ఉపశమనముకలుగును.

వాయింట ఆకులయొక్కగాని గింజలయొక్కగాని రసమునైనను సరే లేదా కషాయమునైనను సేవిస్తే హృదయమునకు మేలుకలుగును. రసముయొక్క మోతాదు పూటకు 2, 3 తులములెత్తు. కషాయముయొక్క మోతాదు 5 మొదలు 8 తులములెత్తు.





# మాల్కోసు

ఇది మాల్కోసు రాగభావమునకు సాంప్రదాయకమైన చిత్రణ. గంభీర పురుషాకృతి ననుసరించు కల్పన గల ఈ రాగము ను రాత్రి వేళల పాడుకొందురు. ఈ రాగాలాపన సంగీత ప్రియత్వముచే లలితుడైన ఒక వీరుని మనకు గోచరింప జేయును. ప్రణయమందలి పరిపూర్ణానందానుభూతి ఇందలి ముఖ్యభావము.

ఋతు, కాల, భావానుగుణంగా రాగాల సృష్టియే భారతీయ గానకళా వైశిష్ట్యం. ప్రతి రాగం ఒకభావాన్ని, ఒక కాలాన్ని స్ఫురింప జేస్తుంది. రాగాల కాలం భావస్ఫురణలకు అనుగుణంగా రూపొందించబడిన చిత్రాలు యుగయుగాలనుంచి ప్రచారంలోవున్నవి. అకాల రాగాలాపన గానమాధుర్యాన్ని నశింపజేస్తుంది.

## తేనీరు

రాత్రింబగళ్లలో ఎప్పుడైనా, ఎలాంటి స్థితిలో వున్నా, తేనీరు ఉత్తేజం కలిగిస్తుంది




మా కార్యాలయమునకు 'Nut shell mag' చేరినది. ఇది ప్రారంభమునుండి మాకార్యాలయమునకు వస్తున్నది.

దీని సంపాదకుడు శ్రీ ఇ. భవాని ప్రసాద్. యువకుడు. రాజకీయ, సాంఘిక, ఆర్థికరంగాలలో కష్ట సుఖాల దృష్ట్యా అపార అనుభవము కలవాడు. మంచివక్త. మహత్తరమయిన ఆత్మ బలం కలవాడు. కొంతకాలం ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారికి ప్రైవేటు కార్యదర్శిగా నుండినవాడు.

ఈతని అపార అనుభవము, విశాల దృక్పథము, సమర్థతలు యీ ఇంగ్లీషు పక్షపత్రికగా రూపొందిన వనడం అతిశయోక్తిగాదు. ఆంగ్లభాష ప్రపంచమంతటా వెల్లివిరిసిన యీరోజులలో యీపత్రిక ఆంధ్ర ప్రజానీకంలో వినోద విజ్ఞాన వికాసాల, వ్యాప్తికి ఉపకరించగలవనుటలో సందేహములేదు. కార్యస్థానము. జాఫర్ సారంగ్ స్ట్రీటు, మదరాసు. విడిపత్రిక 6 అణాలు.

'సంస్కృతి' వైజ్ఞానిక సారస్వతమాసపత్రిక ప్రథమ సంచిక మాకార్యాలయమునకు చేరినది. సంపాదకుడు శ్రీ యన్ నాగేశ్వరావు. సంవత్సర చందా రు5-0-0. విడి ప్రతి 0-8-0 ప్రాప్తి స్థానము సంస్కృతి కార్యాలయం, రాజమహేంద్రవరం.

ఇందలి రచనలు అమూల్యమైనవి. ఈ పత్రికయొక్క లక్ష్యము విజ్ఞాన, సారస్వతముల వ్యాప్తి కాబట్టి యిందలి రచనలు సయితము ఉత్తమ పండిత, విద్వాంసులచే రచియింపబడినవిగానున్నవి.

ఈ పత్రికయొక్క ఉత్తమ లక్ష్యాల సాధన సందర్భంలో సంపాదకునితోబాటు ఉపదేశికవర్గం సయితం అచంచల దీక్షతో పనిచేయుచుండుట పేర్కొనతగిన విషయము.

'సౌభాగ్య' మదరాసు ప్రభుత్వ స్త్రీ జనాభ్యుదయ శాఖచే ప్రచురింపబడే సచిత్ర సాంఘిక సంక్షేమ మాసపత్రిక. ప్రత్యేక వార్షిక సంచిక వెల 0-8-0. వార్షిక సంచికతో సాలుచందా 2-0-0 మాత్రం.

ప్రతులకు, ఎడిటర్, ''సౌభాగ్య'', 7, ఆరాముదు గార్డెన్ స్ట్రీట్, ఎగ్మూరు, మదరాసు-8.

'సౌభాగ్య' 1953 ప్రత్యేక వార్షిక సంచిక మా కార్యాలయమునకు చేరినది. త్రివర్ణముఖ చిత్రముతోటి, యింకా యితర చిత్రాలతోటి అందంగా వెలువడింది. దీనిలోని కథలు, నాటికలు, మహిళా పురోభివృద్ధికై ఉద్దేశించబడిన వ్యాసములు అమూల్యమైనవి. ఇందలి చిత్రములు అనేక చిత్రకారుల కవకాశమిచ్చి ప్రోత్సహించుట కుద్దేశింపబడినవేమోననిపిస్తున్నవి. సౌభాగ్య స్త్రీల రచనలకు, నేర్పరితనానికి ఎక్కువ అవకాశమిచ్చి మహిళా ఉద్యమవ్యాప్తికి నిరంతరము కృషిచేయగలదని మా నమ్మకము. ఈ సంచికను వెలువడజేసిన సందర్భంలో మద్రాసు ప్రభుత్వ స్త్రీ జనాభ్యుదయ శాఖవారు, సంపాదకులు చూపిన శ్రద్ధాసక్తులు పేర్కొన తగినవి.

"ఏమండోయి! అన్నము వండటానికి బియ్యంలేవు; కుర్చీలో కూర్చొని కూనరాగాలు తీస్తేఎలాగు" అన్నది ఒక ఆవిడ

"అన్నము వండటానికి బియ్యం లేకపోతే దోశలు పోయరాదూ" అన్నాడాయన

"బలేబాగుంది అన్నము వండటానికి బియ్యమేలేకపోతే దోశలు పోయడానికిబియ్యము, మినపప్పులకు ఎక్కడికి పోను" అన్నది ఆవిడ. 'సిసి'

పిచ్చిఆస్పత్రిలో యిద్దరు ఈ లా మాట్లాడుకొంటున్నారు.

ఒకడు:- నేను అలెగ్జాండరు సేనాధిపతిగ పనిచేసాను.

మరియొకడు - నేను నీకు ఆ పదవి ఎప్పుడు యివ్వలేదే!

"ఎన్నెస్"

# సంపాదకీయములు

## ఆహార పదార్థముల ఉత్పత్తి

మనదేశంలోఅన్ని రకాల ఆహార పదార్థముల ఉత్పత్తికి అవకాశాలు మెండు. వ్యవసాయమునకు గాని, పశుసంపద నభివృద్ధి పరచుటకుగాని, కోళ్లు, పందులు, బాతులు, మేకల పెంపకానికిగాని చేపల సేకరణకుగానిగల విశేష సౌకర్యాలకు మనదేశంలోగల అవకాశములు మరెక్కడలేవేమో! అలాయుండి కూడ మనదేశంలో ఆహారకొరత ఏర్పడటం చాల విచారకరమయిన విషయం.

ఈ సందర్భంలో అధికాహారోత్పత్తికి ప్రభుత్వ సహకారం యించుమించుగా లేదనే చెప్పాలి. ప్రభుత్వ సహాయమేయుంటే మనదేశము స్వయంపోషకము కావడమేకాక యితర దేశాలకు సయితము ఆహారము సమకూర్చగలిగేది.

వ్యవసాయమున కనుకూలించుభూమి విశేషంగానుండికూడ సాగుకు తేబడకుండా లక్షలయకరాలు బీడుగానున్నవి. దానిని సాగుకు తీసికొని రావడానికి ప్రభుత్వానికా ఆర్థిక స్తోమతులేదు; సాగుకు తెస్తామంటూ ముందంజవేసే ఉత్పత్తి దారులకా ప్రభుత్వ సహాయం అత్యల్పం. ఈ పరిస్థితులలో వ్యవసాయము తృప్తికరంగా పురోభివృద్ధి గాంచడంలేదు. దానిమూలంగా ఆహార ధాన్యాలకొరత ఏర్పడి, వానికొరకై విదేశాలపై ఆధారపడవలసిన పరిస్థితులు ఉత్పన్నమైనవి.

ఆహారధాన్యాల లోటువలన ఏర్పడిన కొరతను తీర్చగలవానిలో కాయగూరలు, ఫలజాతులు ప్రధానమయినవి.

కాయగూరలను, ఫలజాతులను చిన్నచిన్న తోటలలోను, దొడ్లలోను ఉత్పత్తి చేస్తున్నారు. కాని అవి ప్రజల అవసరాలను తీర్చడంలేదు. కావలసినంత సారవంతమైన భూవైశాల్యమున్నప్పుడు ప్రజలు చిన్నచిన్న సంఘములుగా ఏర్పడి సహకార పద్ధతులద్వారా భారీగా కాయగూరలను, ఫలజాతులను ఉత్పత్తిచేస్తే అవి ప్రజల కందుబాటులోనికివచ్చి ఆరోగ్యకరమైన ఆహారము సమకూరుతుంది. కాయగూరలు, ఫలజాతుల పెంపకం సందర్భంలో స్త్రీ పురుషులు కృషిచెయ్యవచ్చును. విదేశాలలో సంపన్నులు సయితము తమ దొడ్లలో యింటిల్లిపాది కాయగూరలను, ఫలజాతులను పండిస్తారు.

కేంద్రవ్యవసాయమంత్రి కాయగూరలను, ఫలజాతులను ఉత్పత్తిచేయవలసిన ఆవశ్యకతను గురించి నొక్కిచెప్పడంతోబాటు క్రియారూపంగా కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు వాని ఉత్పత్తినిప్రోత్సహించి, సహాయ సహకారములను సమకూరిస్తే ఆహారకొరత చాలభాగం తీరుతుంది.

ఏప్రభుత్వమైననుసరే ఆహారోత్పత్తికి ప్రాధాన్యమిచ్చి ప్రోత్సహిస్తే సత్ఫలితాలకు సందేహముండదు.

## ప్రాథమిక విద్యాబోధకు నూతన విధానం

విద్యా సంస్కరణలకని ఆందోళన నేటిదికాదు. ఎట్టకేలకు నేటికి ప్రాథమిక విద్యాబోధకు ఒక విధానమంటూ ప్రణాళిక వెలువడింది.

ఈ విధానము ననుసరించి బాల బాలికల ఆరోగ్య సౌభాగ్యములు అభివృద్ధిగాంచేలాగ విద్యావిధానం రూపొందించబడింది. గంటలు తరబడి పాఠశాలలో కూర్చొని విద్య అంటూ నేర్చుకొని చివరకు శారీరకంగా బలహీనులయి కాయకష్టమున కుపకరించకుండా పోవడమును యీ విద్యా విధానము తొలగించడానికి ఉద్దేశించబడింది.

ఈ విధానంలోని ప్రధానాంశాలు — రోజుకు మూడు గంటలు మాత్రమే బడిగంటలుగా నుంటవి-అంటే ఒక పూట కాలీ యుంటుంది. ఆ కాలీలో వారివారి కుటుంబవృత్తులు, భావిజీవితంలో బాలబాలికలు నిర్వహించవలసిన ధర్మాలూ, లోకజ్ఞాన మభివృద్ధిగాంచేవిద్య నేర్పబడుతుంది.

అంటే గ్రామాలలో ప్రతియొక్క కుటుంబము వ్యవసాయము, కమ్మరి, కుమ్మరి, మేదర మొదలగు వృత్తులను జీవనోపాధిగా కలిగియుంటుంది. ఆయాకుటుంబములోని బాలబాలికలకు వారివారి వృత్తులలో శిక్షణ యివ్వబడుతుంది. ఇటువంటి ఏ వృత్తిని అవలంభించని కొన్ని కుటుంబాలలోని బాలబాలికలకు వారి వారి అభిరుచినిబట్టి ఏదో ఒక వృత్తిలో శిక్షణ యివ్వబడుతుంది. అంతేకాకుండా సంఘమున కుపకరించు సేవాతత్పరత, విజ్ఞాన వికాసాదులు బాలబాలికలకు సమకూర్చబడుతవి.

ఇట్టి విద్యా విధానం మూలంగా బాలబాలికలకు విద్యతోబాటు ఏదో ఒక వృత్తివిద్య వచ్చి యుంటుంది. ఇది భవిష్యత్ జీవితంలో నిరుద్యోగ సమస్యకు గురికాకుండా వారి జీవనోపాధినికి ఉపకరిస్తుంది. ఆరోగ్యం పెంపొందుతుంది. వారి వారి ధర్మాలను, బాధ్యతలను తెలిసికొని దేశశ్రేయస్సుకు కృషి చేయకలుగుతారు. ఇటువంటి విధానం సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా దేశము మొత్తముమీద మహత్తరమయినమార్పు తేగలదనడంలో సందేహం లేదు.

ఇక సెకండరీ విద్యా విధానంలోకూడ కొన్ని మార్పులు నిర్దేశించబడినవి. విద్యా బోధనలో సిద్ధాంత భాగం, శాస్త్రజ్ఞానం, ప్రధానంగా గణితానికి, సైన్సుకు సంబంధించినదిగా నుండాలనియు, సెకెండరీ విద్య నేర్చుకొన్న తరువాత ప్రవేశించతగిన టెక్నికల్ పాఠశాలలు—ట్రేడ్ స్కూల్సు హెచ్చుగా స్థాపించబడాలని సూచించబడినవి—అంటే వృత్తి విద్యను స్పెషలైజు చెయ్యడానికి ట్రేడ్ స్కూల్సు ఉద్దేశించబడినవి.

ప్రాథమిక విద్యాబోధకు నిర్దేశించబడిన క్రొత్త విద్యావిధానం, వృత్తి విద్యలో పరిచయమును, సెకండరీ విద్యా విధానం సిద్ధాంతభాగం, శాస్త్రజ్ఞానముల అభివృద్ధియును, ట్రేడ్ స్కూళ్లు వృత్తివిద్యయందు పరిపూర్ణ శిక్షణయును సమకూర్చును.

ఈ విద్యాబోధలోని మార్పులను ప్రజలు పరిశీలించి తమభావి భాగ్యోదయానికి ఉపయోగించుకొనెదరుగాక !

## ఎలిజబెతురాణి పట్టాభిషేక మహోత్సవము

రాణిపట్టాభిషేకమహోత్సవ సందర్భమున ఆమె ప్రజలు, బంధుమిత్రులు, మిత్రరాజ్యాలు, కామన్ వెల్తు రాజ్యాలు అత్యంత ఆనందోత్సాహములతో పాల్గొననున్నారు. ఉత్తమ సాంప్రదాయాల ననుసరించి అవ్యాజమైన ప్రేమతోటి తన ప్రజలను పాలించే సందర్భమున రాణి తన ధర్మాలను నిర్వహిస్తుందని ఆశించుచున్నాము.

శాంతి, పురోభివృద్ధుల దృష్ట్యా ఎలిజబెతురాణి ప్రభుత్వాధినేతగా బ్రిటను సాధించవలసిన ఘన కార్యము లనేకములున్నవి. ఈమె కాలంలో తన పరిపాలనక్రింద ప్రజలు, సమస్యలు పక్షపాత రహితంగా, న్యాయంగా ధర్మంగా పరిపాలించబడి, పరిష్కరించబడి లోకకల్యాణానికి దోహదమివ్వగలదని ఆశిస్తూ యీ సందర్భంలో బ్రిటిషురాణిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాము.

---

మా 'గృహలక్ష్మి' పత్రికకు కొంతకాలము సంపాదకత్వము వహించిన శ్రీ జయంతి బ్రహ్మానందగారు పరమపదించారు.

వారిని పత్రిక రచయితగాను, రాజకీయ రంగంలోను, సంఘ సేవకుడుగాను ఎరుగనివారుండరు.

వారికి సుస్థిరమైన ఆత్మశాంతిని ప్రసాదించవలసినదిగా భగవంతుని ప్రార్థిస్తూ వారి కుటుంబానికి మాసానుభూతిని తెలుపుతున్నాము.

# శ్రీ విజయనామ సంllర నిజవైశాఖ-జ్యేష్ఠమాసములు

| | | | |
|---|---|---|---|
| 1953 సంll మే నెల | 16 | శ | త్రృ 4-59 ఆర్ద్ర 60-0 త్యాదివి 23-37 |
| | 17 | ఆ | చ 5-13 ,, 3-39 రావి 2-30 |
| | 18 | సో | పం 7-15 పున 5-8 దివి 26-35 శంకరజయంతి |
| | 19 | మం | ష 9-27 పుష్య 9-26 రావి 12-19 |
| | 20 | బు | స 13-14 ఆశ్లే 14-45 ,, 15-46 |
| | 21 | గు | అ 17-50 మఖ 20-48 ,, 10-58 |
| | 22 | శు | న 22-47 పుబ్బ 27-19 ,, 15-14 |
| | 23 | శ | ద 27-50 ఉత్త 33-50 ,, 25-2 |
| | 24 | ఆ | ఏ 32-31 హ 39-57 |
| | 25 | సో | ద్వా 36-25 చి 45-20 దివి 1-38 పరుశురామ ద్వాదశి |
| | 26 | మం | త్ర-39-15-స్వా 49-38-దివి-0-20 |
| | 27 | బు | చతు-41-2-విశా 52-55-దివి-4-25 |
| | 28 | గు | పౌ ○ 41-28-అనూ 54-50-దివి-3-15 |
| | 29 | శు | కృ-ప్ర-40-45-జే-55-43-దివి-19-11 |
| | 30 | శ | ద్వి-38-31-మూల-54-59-రావి-17-51 |
| | 31 | ఆ | తృ-35-21-పూ-షా-53-24-దివి-18-24 |
| 1953 సంll జూన్ నెల | 1 | సో | చ 31-12 ఉషా 10-52 దివి 12-22 |
| | 2 | మం | పం 26-17 శ్ర 49-39 దివి 0-40 |
| | 3 | బు | ష 20-48 ధని 43-51 రావి 26-29 |
| | 4 | గు | స 14-54 శత 39-51 దివి 0-39 |
| | 5 | శు | అ 8-45 పూభా 35-39 రావి 25-46 |
| | 6 | శ | న 11-16 ఉభా 31-32 |
| | 7 | ఆ | ద-ఏ 7-45 రే 27-45 రావి 24-21 |
| | 8 | సో | ద్వా 45-49 అశ్వి 24-26 దివి 14-58 |
| | 9 | మం | త్ర 41-31 భర 21-47 రావి 18-40 |
| | 10 | బు | చతు ● 38-8 కృ 20-1 రావి 27-11 |
| | | గు | అమా 35-48 రో 19-13 రావి 1-0 |
| | 11 | | జ్యేష్ఠమాసం |
| | 12 | శు | శు-ప్ర 34-38 మృ 19-34 రావి 8-47 |
| | 13 | శ | ద్వి 34-44 ఆర్ద్ర 21-8 రావి 20-43 |
| | 14 | ఆ | తృ 36-5 పున 23-57 రావి 12-57 |
| | 15 | సో | చ 38-39 పుష్య 27-57 |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd., 15. Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

# గృహలక్ష్మి ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | ఫిలోమెనాతంబుచెట్టి జీవితచరిత్ర (ఆంగ్లము) | 0-12-0 |
| 2. | నవమణిమాల (నవల, తమిళం) : శ్రీమతి యస్. ఆర్ జయలక్ష్మి | 0-12-0 |
| 3. | వేప (వైద్యగ్రంథము) : శ్రీ కె. యస్. కేసరిగారు | 0-12-0 |
| 4. | బిల్వ (వైద్యగ్రంథము) : ,, | 0-12-0 |
| 5. | అరవింద (నవల) : శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు | 1-0-0 |
| 6. | శ్రీజ్ఞానప్రసూనాంబికాశతకము : శ్రీమతి గంటికృష్ణవేణమ్మగారు | 0-6-0 |

## మా దగ్గర లభించు గ్రంథము

దేవీభాగవతము : శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు 12-8-0

## అచ్చులోనున్నవి

తులసి (వైద్యగ్రంథము) : శ్రీ కె. యస్. కేసరిగారు

నాచిన్ననాటి ముచ్చట్లు : శ్రీ కె. యస్. కేసరిగారు



## గృహలక్ష్మి కార్యాలయము

రాయపేట, మద్రాసు-14.

